# మాఘకావ్యవైభవం


ర చ న :

కె. వి. రాఘవాచార్యులు



ప్ర చు ర ణ :

యువభారతి

రిజిస్టర్డ్ నెం. 1/64

యువభారతి కార్యాలయం

ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు

తిలక్ రోడ్, హైదరాబాదు-500 001

MAAGHA KAAVYA VYBHAVAM
Selections from Classic 'MAAGHAM'
with Commentary by Sri K. V. Raghavacharyulu.

---



యువభారతి

ప్రచురణ : 95

ప్రథమ ముద్రణ : డిసెంబరు 9, 1983

ప్రతులు : 2,200

ముఖచిత్ర రచన : శీలా వీర్రాజు

ముద్రణ : పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్, హైదర్‌గూడ, హైద్రాబాద్.

ముఖచిత్ర ముద్రణ : బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్, చిక్కడపల్లి, హైద్రాబాద్.

ప్రతులకు :

యువభారతి
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-500003 లేదా
యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్డు, హైదరాబాదు-500001

వెల : రూ. 4-00

# యువభారతి పరిచయము

ఉత్తమ అధ్యయనం వల్ల వ్యక్తిత్వానికి సమగ్రత చేకూరుతుంది. సమాజంలో సామరస్యం పెంపొందుతుంది. ఉత్తమ భావ ప్రసరణానికి పుస్తకాలు చక్కని సాధనాలు. అందరికీ అందుబాటులో ఉండే విధంగా మంచి పుస్తకాలను అందించే ప్రయత్నానికి యువభారతి పూనుకొని కడచిన ఇరువయ్యేళ్లుగా పాత కొత్తల మేలుకలయికను ప్రాతిపదికగా పెట్టుకొని నూరు పుస్తకాలను ప్రచురించింది. ఉపన్యాసమంజరీ కార్యక్రమాలను, సదస్సులను నిర్వహించింది.

సహృదయుల సహకారంతో పుస్తకాల అమ్మకం వల్ల వస్తున్న ద్రవ్యంతో పుస్తకాలను ప్రచురిస్తూ తక్కువ వెలకు ఎక్కువ విలువ వున్న సాహిత్యాన్ని అందించడానికి యువభారతి ఉద్యమిస్తున్నది. ఉత్తమ సాహిత్య ప్రచారాన్ని ధ్యేయంగా పెట్టుకొని, ప్రచురణలను వెలువరిస్తున్నదే కాని మా సంస్థ వ్యాపార సంస్థ కాదు.

భారత దేశంలో ఎక్కడున్నాసరే యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలు పంచుకునేందుకు ప్రారంభింపబడిన సాహితీమిత్ర పథకంలో 8500 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేసినారు. యువభారతీ భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వ పథకాలలో భారతీ మిత్రులుగా 975 మంది, భారతీ భూషణులుగా 125 మంది చేరారు.

హైదరాబాదు
డిశంబర్, 9, 1983

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షులు, యువభారతి

# మా మాట

సంస్కృత కవుల్లో ఉపమలు అంటే పోలికలు చెప్పడంలో కాళిదాసు గొప్పవాడు. గంభీరమైన అర్థాలను గుబాళించి కవితలను వెలయించినవాడు భారవి. మృదులమైన పదాలను ఇంపు సొంపులొలికేటట్లు ప్రయోగించడంలో మంచి నేర్పున్నవాడు దండి. అయితే మాఘునిలో ఈ మూడు గుణాలు ఉన్నవని అలనాడెప్పుడో మాఘుణ్ణి గూర్చి ఒక అభినివేశం ఉన్న అభిమాని అన్నాడు. మాఘుడు గొప్ప కవి. దార్శనికుడు. శాస్త్రపరిజ్ఞానాన్ని పుష్కలంగా సముపార్జించుకున్న విజ్ఞానఖని. ఆయన ''శిశుపాల వధ'' కావ్యం భారతీయులకు పఠనీయ కావ్యం. సంస్కృతభాషతో పరిచయం లేకపోయినా ఆయన కవితాత్మతో పరిచయం కలిగించుకోవడం మంచిది. ఈ ఉద్దేశంతో, ఆయన కావ్యంలోని కొన్ని శ్లోకాలకు తెలుగులో సరళమైన వ్యాఖ్యానం వ్రాసి ఇయ్యవలసిందిగా మేము శ్రీ కే.వి. రాఘవచార్యులను ప్రార్థించినాము. ఆయన మేము నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంపట్ల ఆసక్తి చూపుతున్న సహృదయులు. సంస్కృతాంధ్ర భాషలలో చక్కని వైదుష్యం ఉన్నవారు. వేదాధ్యయన తత్పరులు. ఎం.ఏ.,బి.ఎడ్., పట్టభద్రులు. ప్రస్తుతం సిద్దపేట ప్రభుత్వ కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా పనిచేస్తున్నారు. సౌమ్యమూర్తులు. స్నేహశీలురు. ''మాఘకావ్యవైభవాన్ని'' ప్రచురించుకునేందుకు మాకు అవకాశం కల్పించిన శ్రీ కే.వి. రాఘవాచార్యులుగారి ఉదార హృదయానికి మా ధన్యవాదములు.

ఇరివెంటి కృష్ణమూర్తి

9-12-83 అధ్యక్షుడు, యువభారతి.

# ముందుమాట

"ఇందీవరదళశ్యామ మిందిరానంద కందళమ్,
వందారు జనమందారం వందేహం యదునందనమ్" (మల్లినాథసూరి)

సంస్కృత సాహిత్య రత్నాకరంలో ఒక అనర్ఘమైన రత్నం 'శిశుపాల వధ' మహాకావ్యం.

రఘువంశం, కుమారసంభవం, మేఘసందేశం, కిరాతార్జునీయం, శిశుపాల వధ అనేవి పంచకావ్యాలు. కొందరు మేఘసందేశానికి బదులు 'నైషధం' కలిపి పంచకావ్యాలంటారు. ఈ ఆరు కావ్యాల్లో కాళిదాసు రచించిన మొదటి మూడు కావ్యాలు 'లఘుత్రయి' అనీ, తక్కిన మూడు కావ్యాలు 'బృహత్రయి' అనీ ప్రసిద్ధి పొందాయి.

శ్రీ మాఘకవి రచించిన 'శిశుపాలవధ' మహా కావ్యాన్ని మాఘ కావ్యమని కూడా అంటారు.

మాఘకవి అయిదు శ్లోకాల్లో తన వంశాన్ని గూర్చి చెప్పుకున్నాడు. శ్రీవర్మలరాజు దగ్గర మహామంత్రిగా ఉన్న 'సుప్రభదేవుని'ని పౌత్రుడు, ఎందరికో ఆశ్రయమిచ్చి 'సర్వాశ్రయు'డన్న ప్రసిద్ధిని పొందిన 'దత్తకు'ని పుత్రుడు శ్రీ మాఘుడు.

ఆనందవర్ధనుడు 'ధ్వన్యాలోకం'లోనూ, వామనాచార్యుడు తన 'కావ్యాలంకార సూత్రవృత్తి'లోనూ మాఘకావ్య శ్లోకాలను ఉదాహరించారు. కాబట్టి వీరి కంటె మాఘుడు పూర్వుడనక తప్పదు. మాఘకవి న్యాసగ్రంథాన్నీ, కాశికావృత్తినీ పేర్కొన్నాడు. ఈ కాశికావృత్తి రచన ఆరవ శతాబ్ది మధ్య కాలంలో జరిగిందని విజ్ఞులు నిర్ణయించారు. ఇటీవల 'వసంతగఢ్' నగరంలో లభించిన శ్రీవర్మలరాజశాసనం క్రీ.శ. 625 లో వ్రాసినట్లుంది. ఇది సుప్రభదేవుని కాలం. కాబట్టి అతని పౌత్రుడైన మాఘకవి ఏడవ శతాబ్ది వాడనడం సత్యదూరం కాదు.

'ప్రభావక చరితం'లోని శ్లోకాల ఆధారంగా గుజరాత్ రాష్ట్రంలో శ్రీవర్మలరాజు అధీనంలో ఉన్న 'శ్రీమాల' నగరం మాఘకవి జన్మ స్థలమని తెలుస్తున్నది.

శిశుపాలవధ మహాకావ్యం కాక మరొక గ్రంథం మాఘకవి వ్రాసినట్లు కనిపించదు. కాని వల్లభదేవుడు (క్రీ.శ. 14 వ శతాబ్దం) తన 'సుభాషితావళి'లో మాఘకవి రచించినవి అంటూ ఈ క్రింది రెండు శ్లోకాలను ఎత్తి చూపాడు:

1. శిలం శైలతటా త్పతత్వభిజనః సందహ్యతాం వహ్నినా,
మా క్రోశం జగతి శ్రుతస్య విఫలక్లేశస్య నామాప్యహం,
శౌర్యం వైరిణి వజ్రమాశుని పతత్వర్థోస్తు మే సర్వదా,
యేనైకేన వినా గుణా స్తృణబుసప్రాయాః సమస్తా అమీ.

2. నారీ నితంబఫలకే ప్రతిబధ్యమానా
హంసేవ హేమరశనా మధురం రరాస,
తన్మోచనార్థ మివ నూపుర రాజహంసా
శ్చక్రందు రార్త ముఖరం చరణావలగ్నాః.

క్షేమేంద్రుడు తన 'ఔచిత్య విచార చర్చ'లో మాఘ కవిదే అంటూ ఈ క్రింది శ్లోకాన్ని ఉదహరించాడు:

బుభుక్షితై ర్వ్యాకరణం న భుజ్యతే
పిపాసితైః కావ్యరసో న పీయతే,
నవిద్యయా కేనచిదుద్ధృతం కులం
హిరణ్యమేవార్జయ నిష్ఫలాః కళాః.

శిశుపాల వధ మహాకావ్యంలోని ఇతివృత్తానికి ఆధారం శ్రీమద్వ్యాస ప్రణీత మహాభారతం. ఈ కథ భాగవతంలో కూడా ఉంది.

శ్రీకృష్ణుడు శిశుపాలుని అంతంలేని దురంతాలను నారదునివల్ల విని, బలరామునితోనూ ఉద్ధవునితోనూ ఆలోచించి. ఇంద్రప్రస్థపురంలో ధర్మరాజు చేసే రాజసూయ యాగానికి వెళ్లుతాడు. రాజసూయ యాగం పురుషోత్తమ పూజతో పూర్తి అవుతుంది. శ్రీకృష్ణుని పూజను సహించని శిశుపాలుడు అతణ్ణి దూషించడమూ, శ్రీకృష్ణు డతనితో సమరంచేసి చివరకు చక్ర ప్రయోగంతో శిశుపాలుని శిరస్సును ఖండించడమూ జరుగుతుంది. ఇదీ ఈ కావ్యంలోని ఇతివృత్తం.

సభలో అగ్రతాంబూలం ఎవరికీయా లని ధర్మరాజు అడిగితే, శ్రీకృష్ణుడే పూజార్హుడని సహదేవుడు చెప్పగానే సభ్యుల ఆమోదంపై అతడు శ్రీకృష్ణుణ్ణి పూజించినట్లు భాగవతంలో ఉంది.

ఇక భారతంలో - అర్చన కర్హుడు అచ్యుతుడే అని భీష్ముడు ప్రతిపాదించినట్లూ, ధర్మరాజు శ్రీకృష్ణుణ్ణి పూజించినట్లూ, శిశుపాలుడు శ్రీకృష్ణుణ్ణి నింది

స్తుంటే సహించని సహదేవుడు, శ్రీకృష్ణుణ్ణి ద్వేషించే వాళ్ళ నణచడానికి తన పాదమెత్తినట్లూ ఉన్నది.

'శిశుపాల వధ' మహాకావ్యంలో మాత్రం అచ్యుతార్చనను ప్రతిపాదించిన భీష్ముడే పాదమెత్తుతాడు. ఇంకా, శిశుపాలుడు దౌత్యం జరుపడం, సంకుల సమరం చేయడం, శ్రీకృష్ణుడు శిశుపాలుణ్ణి రణరంగంలోనే వధించడం అనేవి మాఘకవి చేసిన మార్పులు.

ఇరవై సర్గలూ, 1675 శ్లోకాలూ ఉన్న ఈ 'శిశుపాల వధ' మహాకావ్యంలో శ్రీకృష్ణభగవానుడు కథానాయకుడు. ప్రతినాయకుడు శిశుపాలుడు. ఇది వీరరస ప్రధాన కావ్యం. ఇందులో శృంగార కరుణాదులు అంగ రసాలు. సర్గకొక ఛందస్సుతో ఛందో వైవిధ్యమూ, ప్రతి సర్గాంతిమ శ్లోకంలో భావి కథాంశ సూచనా, స్థానానుగుణంగా మహాకావ్య ధర్మోచితమైన వర్ణనలూ సాంగోపాంగంగా ఉన్నాయి ఈ కావ్యంలో.

మాఘుడు భారవిని అనుకరిస్తూనే కవితా శిల్పంలో చాతుర్యాన్నీ, వైదుష్యాన్నీ, రామణీయకాన్నీ ప్రదర్శించి, అతణ్ణి మించడానికి యత్నించి సఫలుడయ్యాడు.

మాఘేన విఘ్నితోత్సాహా నోత్సహంతే పదక్రమే
స్మరంతో భారవేరేవ కవయః కపయో యథా.

"మాఘమాసంలో ఎండను తలచుకుంటూ ముందడుగు వేయడానికి ఉత్సహించని కోతుల్లా కవులు భారవినే స్మరిస్తూ, మాఘంలో ముందు పదమెత్తకున్నారు." అంటే 'శిశుపాలవధ'కు భయపడుతున్నారన్న మాట.

భారవి శైవుడనీ, మాఘుడు వైష్ణవుడనీ తెలిసినవాళ్ళంటారు. ఏమైనా మాఘ కవి వైదికుడనడం సమ్మతం. భారవిలా మాఘుడు కూడా పర్వత, ఋతు, పుష్పాపచయ, జలక్రీడా, సాయంకాల, చంద్రోదయ, మద్యపాన, సురత, ప్రభాత, ప్రయాణ, దౌత్య, చిత్రయుద్ధ వర్ణనలు చేశాడు.

శ్రీకృష్ణుడు ద్వారకనుంచి ఇంద్రప్రస్థం వరకు చేసిన ప్రయాణం సుదీర్ఘంగా వర్ణింపబడింది ఈ కావ్యంలో. సుదీర్ఘ ప్రయాణంలో సుందర దృశ్యాలను తిలకిస్తూ, మజిలీలు చేస్తూ, విహరిస్తూ, గమ్యం చేరడం అనేది ఆనాడేకాదు, ఈనాడు కూడా ఉంది.

మాఘకవి తన కావ్యాన్ని ''లక్ష్మీపతేశ్చరిత కీర్తనమాత్రచారు'' అన్నాడు. మహాకవి భారవి ''శ్రియఃకురూణాం'' అని 'కిరాతార్జునీయ' మారంభిస్తే మాఘ కవి ''శ్రియఃపతి'' పదంతో తన కావ్యానికి మంగళాచరణం చేశాడు. ప్రతి సర్గలోని చివరి శ్లోకంలో భారవి ''లక్ష్మీ'' పదాన్ని లాంఛనంగా ప్రయోగిస్తే మాఘుడు 'లక్ష్మీ' పదాన్నికాక దానికి పర్యాయమైన ''శ్రీ'' శబ్దాన్ని అంకితం చేసి చమత్కరించాడు. పైగా మాఘకావ్యంలో నగర, సముద్ర, సేనానివేశ, యమునానదీ, భగవదవతార వర్ణనలు అధికంగా ఉన్నాయి. భారవి తన కావ్యాన్ని పద్దెనిమిది సర్గలతో పూర్తిచేస్తే మాఘకవి స్పర్థతో తన కావ్యాన్ని ఇరవై సర్గలతో ముగించి భారవిని మించాడు.

భారవి ఊహించి చేసిన వర్ణనలు కృత్రిమాలై, సత్యశివసుందరంగా భాసించే మాఘుని వర్ణనలకు వెలవెల బోయినాయి. అందుకే ''మాఘ కావ్యం రానంతవరకే భారవి కావ్యం వెలిగింది'' అన్న సూక్తి ఏర్పడింది.

('తావద్భా భారవేర్భాతి యావన్మాఘస్యనోదయః')

మాఘకవి శీలవంతుడు, బలవంతుడు, ఉదారుడు, శబ్దశాస్త్రజ్ఞుడు, ప్రౌఢకవి. ఆయన శైలి జటిలం, ఓజోగుణభూయిష్ఠం.

''మీరు నిజంగా గొప్ప పండితులండీ! ఇంతకు మీరేయే గ్రంథాలు చదివారు?'' అని ఒకడొక పండితుణ్ణి అడిగితే ''మేఘే మాఘే గతం వయః'' అన్నాడట ఆ పండితుడు. కాళిదాసప్రణీతమైన 'మేఘసందేశం' మాఘకవి రచించిన 'శిశుపాలవధ' ఈ రెండు కావ్యాలను చదివేసరికే ఆయన తల పండిం దని అర్థం.

వాస్తవంగా ''నవసర్గగతే మాఘే నవశబ్దో నవిద్యతే.'' మాఘకావ్యంలో తొమ్మిది సర్గలను చదివిన వ్యక్తికి ఇక అర్థం తెలియని శబ్దమంటూ ఉండదు. అంతేకాదు, సాంఘిక, ఆర్థిక, రాజకీయ శాస్త్రాలేకాక, ఆయుర్ధనుర్వేదాల, గజాశ్వనీతి సంగీతజ్యోతిర్వాణిజ్య శాస్త్రాల పరిచయమూ అవుతుంది. పాణిని వ్యాకరణ సూత్రాలకిది ప్రయోగ దీపిక. ముఖ్యంగా ఈ కావ్యం ఒక విజ్ఞాన సర్వస్వమే. కాబట్టి ''కావ్యేషు మాఘః కవికాళిదాసః'' అని ఆభాణకం.

ఉపమాకాళిదాసస్య భారవేరర్థగౌరవమ్,

దండినః పదలాలిత్యం మాఘేసంతిత్రయోగుణాః.

ఉపమాలంకార భూయిష్ఠమైన రచనతో కాళిదాసూ, అర్థగౌరవమున్న కవితతో భారవీ, లలితమైన పదాలకూర్పుతో దండికవీ లబ్ధప్రతిష్ఠులయ్యారు. ఇలా

ముగ్గురికి వేర్వేరుగా ఒక్కొక్క గుణమే ఉంది. ఈ మూడు గుణాలూ ఒక్క మాఘకవికృతిలోనే చోటుచేసుకోవడం ఆయన సుకృతమే. అందుకే ఒక కవి చిత్తశుద్ధితో - "మురారి పదచింతాచేత్తదా మాఘేరతింకురు" అన్నాడు. శ్రీహరి పదచింతన చేయాలనుకుంటే మాఘకావ్యాన్ని శ్రద్ధతో పఠించుమన్నాడు. (మా + అఘే) పాపం చేయకుమని కూడా చెప్పాడు. మురారికవి వ్రాసిన 'అనర్ఘరాఘవం' అనే గ్రంథాన్ని అర్థంచేసుకోవాలనుకుంటే మొదట మాఘ కావ్యాన్ని మనసుపెట్టి చదువుమని మరో అర్థం. ముఖ్యంగా మాఘుని పాండి త్యాన్ని నిగ్గు తేల్చిన నికషోపలం 'శిశుపాలవధ' మహాకావ్యమే. ఈ మహాకావ్యం సారస్వత సారమనీ, చిత్తజాడ్య హరమని ప్రశంసించింది 'సిద్ధర్షిచరితం'.

"శ్రీమాఘో నందనోబ్రాహ్మీ స్యందన శ్శీలచందనః
ఐదం యుగీన లోకస్య సారసారస్వతా యితమ్
శిశుపాల వధం కావ్యం ప్రశస్తి ర్యస్యశాశ్వతీ
శ్రీమాఘోస్తాఘధీ శ్లాఘ్యః ప్రశస్యః కస్యనాభవత్
చిత్తజాడ్యహరాయస్య కావ్యగంగోర్మి విప్రుషః".

'శిశుపాలవధ' కావ్యానికి సంస్కృత పండితులెందరో వ్యాఖ్యానాలు వ్రాశారు. వల్లభదేవుడు 'సందేహ విషౌషధి' వ్యాఖ్యనూ, రంగరాజు 'రంగరాజ' వ్యాఖ్యనూ, మల్లినాథుడు 'సర్వంకష'నూ, భరత మల్లిక 'సుబోధ'నూ, దిన కర మిశ్రుడు 'సుబోధిని'నీ, గోపాలుడు 'హసంతి'నీ వ్రాశారు. ఇంకా ఏకనా థుడూ, చారిత్రక వర్ధనుడుకూడా వ్యాఖ్యానించారు.

సర్వ సర్వంసహా మండలంలో ఎన్ని ఉన్నప్పటికీ మల్లినాథ సూరి వ్యాఖ్యయే 'సర్వంకష'యై కవి హృదయానికి అద్దం పట్టింది. మల్లినాథ సూరి ఉద్ఘాటించినట్లు నిజంగా శ్రియః పతిరమ్య చరిత్రను రచించిన మాఘకవి ధన్యుడు. అతని కావ్యాన్ని చదువడం మనభాగధేయం.

"ధన్యో మాఘకవి ర్వయం తుకృతి న స్తతుసాక్తి సంసేవనాత్."

—కె. వి. రాఘవాచార్యులు.

శ్రీశో ఉవ్యాత్

## మాఘకవి ప్రణీత

# శిశుపాలవధ మహాకావ్యవైభవం

1. *శ్రియః పతి శ్శ్రీమతి శాసితుంజగ*
*జ్జగన్నివాసో వసుదేవ సద్మని*
*వసన్దద ర్శావతరంత మంబరా*
*ద్ధిరణ్యగర్భాంగ భువం మునిం హరిః* (1-1)

ఈ శ్లోకంతో మాఘకవి శిశుపాలవధ మహాకావ్యాన్ని ఆరంభించాడు :-

''శ్రియఃపతి లోకాన్ని శాసించడానికి శ్రీకృష్ణుడుగా అవతరించాడు. సకల సంపదలున్న వసుదేవుని ఇంట్లో ఆయన నివసించాడు. ఒకనాడు దివి నుంచి భువికి దిగివస్తున్న నారదమునిని శ్రీకృష్ణుడు చూశాడు.''

కవులు సంభావిత రసవద్వస్తువును వర్ణవ్యంజితచ్ఛందః పాత్రల్లో నింపుతారు. రసజ్ఞులు దాని నాస్వాదించి ఆనందిస్తారు.

శ్రీకృష్ణుడు మొదట శ్రియఃపతి. ఇపుడు రుక్మిణీపతి. 'రుక్మిణీకృష్ణ జన్మని' అని విష్ణుపురాణవాణి. జగన్నివాసుడంటే అఖిల లోకాలను తన కుక్షిలో ఇముడ్చుకునేవాడు. ఆ లోకాలను సృష్టించి తానూ అవతరించాడు.

''తత్సృష్ట్వా, తదేవానుప్రావిశత్'' అని ఉపనిషద్వాణి.
జగత్తుకే ఆధారమైన భగవంతునికి ఇపుడు జగమే ఆధారమయింది. ఇప్పుడు శ్రీకృష్ణుని కాపురం వసుదేవుని ఇంట్లో.

''పితా పుత్రేణ పితృమాన్ యోని యోనౌ'' అని వేదం చెప్పిన రీతిగా అందరికీ తండ్రి అయిన భగవంతునికి తండ్రియై ఆ విభవావతారాన్ని సేవించి శోభించేవాడు వసుదేవుడు.

''సంప్రతిశ్రయతి సూనుతామయం, కశ్యపస్య వసుదేవరూపిణః''
(శిశు. 14-82)

అని భీష్ముడు కీర్తించునట్లు ఈ వసుదేవుడు ఒకప్పుడు కశ్యపుడు. ఈశ్వర సంబంధమైన ఐశ్వర్యంతో వసుదేవుని ఇల్లు కళకళలాడుతూ ఉంది.

''హిరణ్య గర్భ స్సమవ ర్తతాగ్రే'' అనే శ్రుతి ప్రకారం 'హిరణ్యగర్భు' డంటే, సృష్టిని చేయడానికి అవ్యక్తమైన పరబ్రహ్మనుంచి మొట్టమొదట వ్యక్త రూపుడైన చాతుర్ముఖబ్రహ్మ అని అర్థం.

''ఉత్సంగాన్నారదో జజ్ఞే'' (3-12-23) అనే భాగవత ప్రమాణాన్ని బట్టి, హిరణ్యగర్భుని సంకల్పం చేత అతని ఉత్సంగం నుంచి జన్మించినవాడు నారదుడు.

'మన స్సంకల్పంచేత, దర్శనంచేత, స్పర్శచేత పూర్వులు సంతానాన్ని పొందారు.'

"సంకల్పా ద్దర్శనాత్ స్పర్శాత్ పూర్వేషా మఘవన్ ప్రజాః'' అని చెప్పింది విష్ణుపురాణం. ఇంద్రియసుఖాలలో రమించకుండా ఆత్మారాముడైన ముని నారదుడు.

"తతఃకాలాగ్ని రుద్రోఽసౌ భూత్వా సర్వహరో హరిః'' అనే శాస్త్ర ప్రమాణంవల్ల 'హరి' అంటే సమస్తం హరించడానికి రుద్రరూపుడని అర్థం.

''స్మర్యతే న చ దృశ్యతే'' 'స్మరించేవాడు జీవుడు, దర్శించేవాడు దేవుడు' అనే శ్రుత్యర్థాన్ని 'దదర్శ' అనే క్రియాపదం తెల్పుతుంది.

ఈ శ్లోకంలో శబ్దార్థాల చమత్కారమూ, కథావిష్కారమూ ఉంది.

'శ్రియః పతి, హిరణ్యగర్భుడు, హరి' అనే ఆది మధ్యాంత పదాలు శ్రీకృష్ణుడు త్రిమూర్త్యాత్మక స్వరూపుడని సూచిస్తున్నాయి. శిష్ట రక్షణకూ, దుష్ట శిక్షణకూ అంకితుడయ్యాడు శ్రీకృష్ణుడు. ఆయన రస స్వరూపుడు కూడా. "రసోవై సః." ఆ రస వ్యంజక వాగ్రూపిణి 'శ్రీదేవి.'

"ఋచస్సామాని యజూంషి, సా హి శ్రీరమృతాసతాం" అన్నది వేదం. ప్రణవం మొదలుకొని అమృతమయమైన అనంత వర్ణపద వాగ్రూపంతో ప్రకాశించే శ్రీదేవియే శ్రియఃపతిని సేవింపచేయడానికి ఘటికురాలు. అందుకే 'శ్రియం జ్ఞాత్వా జ్ఞాతవ్యో భగవాన్ హరిః' అన్నారు పెద్దలు.

వ్యూహావతారాన్ని సేవించే కశ్యపుడే ద్వాపర యుగంలో వసుదేవు డయ్యాడన్న అర్థమేకాక 'వసుదేవుని యింట్లో నివసిస్తున్నవా' డనడం వల్ల 'అంతర్యామి' అని, "ఆత్మాగుహాయాం నిహితో స్యజంతోః'' అన్న వేదార్థం కూడా విశదమవుతుంది.

''సత్త్వం విశుద్ధం వసుదేవ శబ్దితం, యదీయతే'' (4-1-23) అని భాగవత ప్రమాణం. వసుదేవ శబ్దానికి రజస్తమోగుణాలంటని శుద్ధ సత్త్వ ప్రధానమైన అంతఃకరణమని అర్థం.

'అంతః ప్రవిష్టశ్శాస్తా జనానాం' అని శ్రుతి పలికినట్లు హృదయ సదనంలో వెలుగుతూ శాసించే 'అంతర్యామి' శబ్దబ్రహ్మోపాసకుడైన కవిని చూశాడు, అంటే ప్రేరేపించాడన్న అర్థంకూడా ప్రతీయమానమవుతుంది.

ఇలా పర, వ్యూహ, విభవాంతర్యా మ్యవతారాల తత్త్వాన్ని శ్రుతి స్మృతుల ద్వారా ధ్వనింపచేస్తూ అనిర్వాచ్యుడైన వాసుదేవుడే శ్రీకృష్ణుడని వివరిస్తుంది ఈ శ్లోకం. ముఖ్యంగా "శాస్త్ర యోనిత్వాత్'' (1-2-3) బ్రహ్మ సూత్రార్థాన్ని తెల్పుతుంది.

జగన్నివాసుడు జగత్తులో, అందులో ఒక నగరంలో, అందులో ఒక ఇంట్లో ఉండడం ఆయన స్వరూపానికి విరుద్ధమే. అయినప్పటికీ 'స్వేమహిమ్ని ప్రతిష్ఠితః' అన్నట్లు శ్రీకృష్ణుని లీల అనిర్వచనీయం. కాబట్టి విరుద్ధంకాదు, అది అధిక్యాలంకార నిబద్ధం.

నిగమ కాంత సిగలో నగగా శోభించే శ్రియః పతిని మాఘకవి తన కావ్య కాంతా ముఖాన మంగళ దీప రేఖా తిలకంగా తీర్చి చిత్రించాడు. ఈ 'శ్రియః పతి' శబ్దం అలుక్సమాసం. ఇది వ్యస్త పదంగానూ, సమస్త పదంగానూ వ్యవహరిస్తుంది. ఇది నిత్య దాంపత్యాన్ని స్పష్టం చేస్తుంది. స్త్రీ పురుష భేదం చేత రెండుగా కన్పించినా - 'ఎలెక్ట్రాన్, ప్రోటాన్'గా విభాజిత మైన విద్యుద్ఘటంలా, మూల శబ్దశక్తి ఒక్కటే.

ఈ శ్లోకంలో చివరిపదం 'హరి'. ఇది చివరకు కావ్య ఫలమైన శిశు పాలుని వధను సూచిస్తుంది. సకారాల తకారాల పునరుక్తి, 'జగజ్జగ' పద పూరణం నాద మోదాలకు కారణమై అలంకార తోరణంగా భాసిస్తుంది.

ఇంద్రుని సందేశ మందించడానికి ఆకాశంలో పయనిస్తూ. ఆ పనిమీద అడుగులు మోపే నారద మునిని శ్రీకృష్ణుడు దర్శించడం కావ్య వస్తువుకు తేజో బీజమై మాఘ కావ్యం దివ్యంగా కొనసాగింది.

**2.** *హరత్యఘం సంప్రతి హేతురేష్యత*
*శ్శుభస్య పూర్వాచరితైః కృతం శుభైః*
*శరీరభాజాం భవదీయ దర్శనం*
*వ్యనక్తి కాలత్రితయేఽపి యోగ్యతామ్.* **(1.26)**

శ్రీకృష్ణుడు నారదమునిని సముచితంగా సత్కరించి చిరునవ్వుతో చిలికిన పలుకులు—

"మీ దర్శనం మూడు కాలాల్లోనూ జనుల యోగ్యతను ప్రకటిస్తుంది. భూతకాలంలో చేసిన సుకృతాన్ని పరిణమింపచేస్తుంది. వర్తమాన కాలంలో పాపాన్ని హరిస్తుంది. భవిష్యత్కాలంలో శ్రేయోదాయకం" అని అర్థం.

మహాత్ములు ఊరకరారుకదా! దేహయాత్రకోసం అహోరాత్రాలు ఏవో పనులు మనం చేస్తుంటాం. తెలిసీ తెలియక చేసే పనులన్నీ మంచివనే నమ్మకం మనకు ఎలా కలుగుతుంది? మనం చేసిన పనులకు ఫలం పొందడానికి చాలా కాలం పడుతుందికూడా. ఆ పొందిన ఫలంకూడా మన కిష్టమైనదీ, కానిదీకావచ్చు. ఇంతకూ అది ఏ కర్మఫలమో ఊహించలేం కదా! కాబట్టి మంచి పనులు చేసే వారి దగ్గిరకే మహాత్ములు ప్రేమతో వస్తుంటారని అనుభవంతో తెలుసుకో వలసిందే.

ఈ మాటను "సతాంసద్భిస్సంగః కథమపిహి పుణ్యేన భవతి"(ఉ.రా.చ.) అని భవభూతి కూడా అన్నాడు.

'బ్రహ్మజ్ఞానులు దివిలోగానీ, భువిలోగానీ ఒక్కచోట నిల్వక అన్ని ప్రాంతాలను అవ్యాహతగతితో సంచరిస్తూ పవిత్రం చేస్తా' రన్నది వేదం.

"యేభ్యోనబుతే పవతేధామకించన నతేదివో నపృథివ్యా అధిస్నుష."

నారదుడు ఆరదుడు కాదు. అంటే కామక్రోధాది అరిషడ్వర్గానికి అవకాశ మిచ్చేవాడు కాడు. తన జ్ఞాన వైరాగ్యాలచేత నరుల విషయ సుఖాన్ని తొలగించే వాడు నారదుడు. ఆయన శారీరకంగా తెల్లనివాడు, మానసికంగా నిర్మలుడు. వ్యావహారికంగా లోకకళ్యాణకారకుడు. అయనకు అది ఆజానజం.

ఈ నారదుని దర్శనం ఇదివరకెంతో పుణ్యం చేస్తేనే కాని లభించలే దంటాడు శ్రీకృష్ణుడు. మేను పాపాలబోను. కాబట్టి సత్పురుషుల దర్శనమైన వెంటనే పాపాలన్నీ పటాపంచలైపోతాయి. ఇకముందు సకల శుభాలూ కలుగు తాయి. కాబట్టి సత్పురుషుల దర్శన భాగ్యం - సామాన్యునికి కూడా - కల్గితే అది అతని జన్మసాఫల్యాన్ని ప్రకటిస్తుంది.

ఇలాగే 'కిరాతార్జునీయం'లో 'భారవి' రచించాడు.

"శియం వికర్షత్య పహంత్యఘాని, శ్రేయః పరిస్నోతి తనోతికీర్తిమ్;
సందర్శనం లోకగురోరమోఘం తవాత్మయో నేరివకిం నధత్తే. (3-7)

''బ్రహ్మ దర్శనంలాగా మీ దర్శనంవల్ల మావంటి వారికి ఐశ్వర్యం కలుగుతుంది. పాపాలు నశిస్తాయి. ధర్మం వృద్ధి పొందుతుంది. కీర్తి విస్తరిస్తుంది. ఒకటేమిటి? కోరికలన్నీ సిద్ధిస్తాయి'' అని ధర్మరాజు వ్యాసమహర్షిని ప్రశంసిస్తాడు.

మాఘకవిశ్లోకం ''తదధిగమ ఉత్తర పూర్వాఘయో రశ్లేషవినాశౌ తద్దర్శనాత్'' (4-1-9/13) అనే బ్రహ్మ సూత్రార్థాన్ని వివరిస్తుంది.

*3.* *కృతః ప్రజాక్షేమకృతా ప్రజాసృజా*
*సుపాత్రనిక్షేపని రాకులాత్మనా*
*సదోపయోగేఽపి గురుస్త్వమక్షయో*
*నిధిశ్శ్రుతీనాం ధనసంపదామివ.* *(1-28)*

శ్రీకృష్ణుడు నారదుణ్ణి ప్రశంసించిన శ్లోకమిది :-

''సంతానానికి మేలుచేసే తండ్రి బొక్కసంలో రొక్కం పెట్టి నిశ్చింతగా ఉంటాడు. ఆ రొక్కాన్ని పెక్కుసార్లు తన సంతానం దాన భోగాలకు వాడుకున్నా అది తరుగని పెన్నిధి. అట్లే ప్రజాక్షేమాభిలాషియైన బ్రహ్మ, యోగ్యుడవైన నీకు వేదాలను బోధించి స్వస్థ చిత్తుడయ్యాడు. నీవు ఉపదేశించిన కొద్దీ అక్షయంగా ఉండే వేద నిధివి.''

ఇది శిష్ట పద రచన.

'ప్రజాసృట్', అంటే 'బ్రహ్మ' అని, 'కన్నతండ్రి' అని రెండర్థాలు.

"ప్రజయాహిమనుష్యః పూర్ణః" చక్కని సంతానాన్ని పొందిన మానవుడు పూర్ణుడౌతాడు.

నారదుడు తపస్స్వాధ్యాయనిరతుడు. యోబ్రహ్మాణం విదధాతి పూర్వం, యోవైవేదాంశ్చ ప్రహిణోతితస్మై. "తేనే బ్రహ్మ హృదాయ అదికవయే" అనే వేద, పురాణ వాక్యాలు 'సర్వేశ్వరుడు బ్రహ్మకు వేదాలను బోధించా'డని వివరిస్తున్నాయి. అలాగే బ్రహ్మ కూడా నారదునికి వేదవిద్యను సమగ్రంగా బోధించాడు.

తండ్రి విద్యను బోధిస్తే నూర్గురు ఆచార్యులు బోధించినంత జ్ఞానం కుమారునికి కల్గుతుంది. అందుకే శ్రుతిస్మృతులిలా అన్నాయి:

"వేద మనూచ్యాచార్యో న్తేవాసిన మనుశాస్తి" (ఉపనిషత్తు)

"ఆచార్యాణాంశతంపితా" (మనుస్మృతి)

సకల వేదశాస్త్రార్థాలను నేర్చి, నేర్పి, స్వయంగా ఆచరించి ఇతరులను ఆచరింప చేసేవాడు ఆచార్యుడు. కర్తవ్యాన్ని ఉపదేశించడమేకాక 'ఈ ధర్మ మెందుకు ఆచరించాలి?' అని అడిగితే దానికి మూల కారణాన్నీ ప్రయోజనాన్నీ నిర్దేశించడం గురు లక్షణం.

బోధన కూడా 'నీరు కొద్దీ తామర' అన్నట్లు ఉంటుంది. గురువు విద్యార్థు లందరికి ఒక్క రీతిగనే విద్యను బోధించినప్పటికీ వారిలో ప్రజ్ఞా మేధాశక్తులు రెండూ ఉన్నవాడే నేర్పరి అవుతాడు. నేర్చినదాన్ని గ్రహించే శక్తియేకాక గ్రహించినదాన్ని ధారణచేసే శక్తి కూడా ఉండడం సత్పాత్ర లక్షణం.

"వాన చినుకు ముత్తెపు చిప్పలో పడి ముత్యమైనట్లు గురువు యోగ్యునికి చెప్పిన విద్య విశేష గుణాన్ని పొంది భాసిస్తుం"దని కాళిదాసు "పాత్ర విశేషేన్యస్తం గుణాంతరం వ్రజతి శిల్పం". (మాళ. 1-6) అన్నాడు.

బ్రహ్మ నిక్షేపించిన నిధి నారదుడు. ధనం రెండు విధాలు.

''చక్షుర్మానుషం విత్తమ్, చక్షుషా హి తద్విందతేః

శ్రోత్రం దైవమ్, శ్రోత్రేన హి తచ్ఛృణోతి.'' (బృహ. ఉపని.)

''వెండి, బంగారం లాంటి భౌతిక ద్రవ్యం కండ్లతో కన తగిన ధనమైతే దివ్య మైన జ్ఞానాన్ని ప్రసాదించే విద్య చెవులతో వినతగిన ధనం.'' విద్య గానీ, ధనం గానీ సత్పాత్ర నిక్షిప్తమైతే అక్షయం.

''ఉపదేక్ష్యంతి తే జ్ఞానం" అన్నట్లు నారదుడు సంప్రదాయ ప్రవర్తకుడు. నారదుడు గురు పరంపరగా పొందిన వైదిక సంప్రదాయంద్వారా ధర్మస్థాపన చేసే లోకాచార్యుడని శ్రీకృష్ణుడు నారదుణ్ణి ప్రశంసించాడు.

''సంప్రదాయ విగమాదుపేయుషీః,'' (శిశు. 14-79) అని మాఘ కవి, భగవంతుడే సంప్రదాయాన్ని వ్యాపింపచేస్తూ వేదమార్గాన్ని ప్రతిష్ఠించ డానికే "దత్త" నామంతో అత్రిగోత్రజు డయ్యాడని విశదీకరించాడు.

4. *ఉదాసితారం నిగృహీతమానసైః*
*గృహీత మధ్యాత్మదృశా కథంచన*
*బహిర్వికారం ప్రకృతేః పృథగ్విదుః*
*పురాతనం త్వాం పురుషం పురావిదః.* **(1-33)**

శ్రేయోదాయకాలైన మీ మాటలు వినాలని నేర్పుతో అడిగిన శ్రీకృష్ణునితో నారదు డిలా అంటాడు:

"కపిలాది మహర్షులు తమ మనస్సు నరికట్టి ఆధ్యాత్మిక దృష్టితో ని సాక్షాత్కారం ఎలాగో పొందారు. వారు నిన్ను ఉదాసీనునిగా, నిర్వికారునిగా, ప్రకృతికంటె విలక్షణునిగా, విజ్ఞానఘనుడైన పురాణ పురుషునిగా ఉపాసించారు. నీవు ఆ ప్రాకృత పురుషుడవు."

ప్రకృతి పురుషుల తత్వాన్ని బోధించిన సాంఖ్యశాస్త్ర దార్శనికుడు కపిల మహర్షి. "అన్యస్య చ కపిలస్య సగర పుత్రాణాం ప్రతప్తుర్వాసుదేవనామ్నః స్మరణాత్." ఈ కపిలుడు సగర పుత్రులను భస్మం చేసిన కపిలునికంటె భిన్నుడని శ్రీ శంకరభగవత్పాదులు బ్రహ్మసూత్ర భాష్యంలో స్పష్టంచేశారు.

"మూల ప్రకృతి రవికృతి ర్మహదాద్యాః ప్రకృతి వికృత యస్సప్త,
షోడశకస్తు వికారో న ప్రకృతి ర్న వికృతిః పురుషః." (సాం.త.కా.3)

అని సాంఖ్యశాస్త్రంలో నాల్గు అంశాలున్నాయి.

1. ప్రకృతి అంటే సత్త్వరజస్తమోగుణాలుకలది. అది సృష్టికర్త్రి.
2. ప్రకృతి వికృతులు ఇది ఏడు మహత్తు, అహంకారం పంచతన్మాత్రలు.
3. (కేవల) వికృతులు. ఇవి పదహారు. పంచభూతాలు. జ్ఞాన, కర్మేంద్రియాలు-అంతఃకరణం.

   వీటిని చతుర్వింశతి తత్త్వాలంటారు.

4. పురుషుడు-ప్రకృతీ, వికృతీ కాని వాడు. నిర్గుణుడు-నిర్లిప్తుడు, ద్రష్ట.

సమాధిస్థులైన యోగులకు సాక్షాత్కరణీయుడైన పురాణ పురుషుడు నిర్గుణుడైనా, ముముక్షువులకు కావలసింది శ్రీకృష్ణుని సాక్షాత్కారమే; అని నారదుడంటాడు.

"మహతః పరమ వ్యక్త మవ్యక్తాత్పురుషః పరః" అని కఠోపనిషత్తు.

"సమ్యగ్దృష్టి స్తస్య పరం పశ్యతి యస్త్వాం,
యశ్చోపాస్తే సాధువిధేయం స విధత్తే". (కిరాతార్జునీయం 18-28)

అని భారవీ,

"తద్దర్శిన ముదాసీనం త్వామేవ పురుషం విదుః". (కు. సం. 2-13)

అని కాళిదాసూ భగవంతుణ్ణి నిర్గుణునిగా, పురాణపురుషునిగా వర్ణించారు.

5. *నిజౌజసోజ్జాసయితుం జగద్ద్రుహా*
*ముపాజిహీథా నమహీతలం యది,*
*సమాహితైరప్య నిరూపిత స్తతః*
*పదం దృశస్స్యాః కథ మీశ మాదృశామ్.* **(1-37)**

సగుణరూపం ఉపయోగకరమని నారదుడు శ్రీకృష్ణుణ్ణి స్తుతిస్తాడు.

''సర్వేశ్వరా ! నీ తేజోగుణంతో లోకద్రోహులైన కంసాదులను వధ తేర్చడానికి నీవు ఈ భూమిమీద అవతరించకనేపోతే, ధ్యాననిష్ఠులైన యోగులకు కూడా గోచరించని నీవు మావంటి సామాన్యజనులకు ఎలా కనబడే వాడవు?''

''నకర్మణావర్తతే నోకనీయాన్. నకర్మణా లిప్యతేపాపకేన'' అని వేద మన్నట్లు భగవంతుడు పుట్టడం మనవలె పూర్వకర్మ ఫలాన్ని అనుభవించడానికి కాదు. అతణ్ణి కర్మలు అంటవు.

"ఇచ్ఛాగృహీతాభిమతోరు దేహః"-"జగతాముపకారాయ న సా కర్మ నిమిత్తజా''. అని విష్ణుపురాణమన్నట్లు విష్ణుమూర్తి తనకు ఇష్టమైన రూపాన్ని ధరించడం లోకోపకారంకోసమే. భవబంధాన్ని తెగగోసే జ్ఞానశక్త్యాది గుణాల చేత లోకకంటకులను యముని ఇంటికి పంపుతాడు. ''దేహినా మనుజిఘృక్షయా వపుః'' (శిశు. 14-62) అని భీష్ముడు స్తుతించే రీతిగా, దేవమానవ పశుపక్ష్యాదులు సేవించడానికే భగవంతుడు అవతరించడమని మాఘకవి రచించాడు.

నారదుడు మాటకారి. భగవంతుడు లోకకంటకులను కంటగించుకోవడం ఫలితంగా లోకుల కంటికింపుగా కనబడుతాడనే సత్యాన్ని సత్తువతో సమ్మేళనం చేసి నారదుడు సగుణోపాసనమే సుగుణ మంటాడు.

ముఖ్యంగా శ్రీకృష్ణుని దివ్య మంగళ విగ్రహాన్ని సేవించడం కంటే నారదునికి వేరే పని లేదట.

*6.* స సంచరిష్ణుర్భువనాంతరేషు యాం
యదృచ్ఛయాశిశ్రియదాశ్రయశ్శ్రియః,
అకారి తస్యై ముకుటోపలస్ఖల
త్కరైస్త్రిసంధ్యం త్రిదశైర్దిశే నమః. (1-46)

శ్రీకృష్ణునికి శిశుపాలుని పూర్వజన్మల ఔద్ధత్యాన్ని ప్రకటించాడు నారదుడు.

''హిరణ్యకశిపుడు లోకసంచారశీలుడు. ఆయన స్వేచ్ఛగా ఏ దిక్కు పోతే దేవతలు, మూడు సందెవేళల్లోనూ, ఆ దిక్కే తిరిగి చేతులెత్తి నమస్కరించేవారు.''

'త్రిసంధ్యమ్' - అంటే ప్రాతర్మధ్యాహ్న సాయంసంధ్యల కాలం. మూడు దశలు (3 × 10) ఉన్నవారు దేవతలని అర్థం.

పరుల ధనాన్ని బలవంతంగా అనుభవించే హిరణ్యకశిపు డంటే దేవత లకు గర్భనిర్భేదం. అతడు పరమైశ్వర్యవంతు డయిన ఇంద్రుణ్ణి నిరర్థకుణ్ణి

చేశాడు. లోకపాలకు లందరూ తోకముడుచుకున్నారు. వీరుడు అని లక్ష్మి అనురాగంతో ఇతణ్ణి ఆశ్రయించింది. హిరణ్యకశిపుడు నిర్భీకుడూ, సశ్రీకుడూ కావడంతో దేవతలు ముప్పొద్దులు మూడు అవస్థలు పడేవారు.

''ఉద్యంతమస్తం యంతమాదిత్య మభిధ్యాయన్'' అనే శ్రుతి ప్రకారం ఉదయాన సంధ్యావందనం తూర్పు దిక్కు తిరిగి చేస్తే, సాయంకాలం పడమటి దిక్కు తిరిగి చేయడం నియమం. చివరకు ఆత్మప్రదక్షిణగా తిరుగుతూ దిఙ్నమస్కారం చేయడంతో సంధ్యావందనం పూర్తి అవుతుంది.

సంధ్యావందనంలో కూడా దిక్కుల నియమం వదలుకొని, దేవతలు తమకు వేరే దిక్కూ మొక్కూలేక, ఆ సురవైరి ఉన్న దిక్కే అయిదు పది చేసేవారు.

ఈ శ్లోకంలో సంయుక్తప్రాణులు ప్రాణాలను బిగబట్టుకొని ప్రాసతో శ్వాస దీసుకుంటున్నాయి.

7. *సమిద్ధశవస్ యః పృథివీ భృతాం వరం*
*వర ప్రదానస్య చకార శూలినః*
*త్రసత్తుషారాద్రిసుతా ససంభ్రమ*
*స్వయంగ్రహాశ్లేషసుఖేన నిష్క్రియమ్.* **(1-50)**

శ్రీకృష్ణా! నీవు నరసింహ రూపాన్ని ధరించి అవలీలగా ఒక్క నీ గోళ్ళతోనే హిరణ్యకశిపుని డొక్క చీల్చేశావు. కాని, అతడు చచ్చినా అతని భుజదర్పం చావలేదనీ, లోక విద్రావణుడైన రావణుడుగా అతడు మళ్ళీ జన్మించాడనీ నారదుడు శ్రీకృష్ణునితో ఇలా అంటాడు:

''రావణుడు దోర్బలంచేత కైలాస పర్వాతాన్ని పెల్లగించాడు. హఠాత్తుగా కొండ కదలగానే పార్వతి గుండె గూడు కదిలింది. వెంటనే సంభ్రమంతో కొండరాచూలి, శూలి ఒళ్ళో ఒరిగి, గట్టిగా బాహువులతో పట్టుకుంది. స్వయంగా ఆలి ఆలింగన సుఖం మహాదేవునికి అయాచితంగా లభించింది. ఈ ప్రత్యుపకారంతో రావణుడు, ముక్కంటి ఇచ్చిన వరానికి మూల్యం చెల్లించాడు.''

''యస్మాల్లోకత్రయం చైతద్రావితం భయ మాగతం,
తస్మాత్త్వం రావణోనామ నామ్నావీరభవిష్యసి.'' (రా.ఉ.కాం.)

విశ్రవసుని కొడుకు అవడంచేత మూడు లోకాలు భయంతో అదిరిపోయినాయి కాబట్టి ఇతనికి రావణుడన్న పేరు సార్థకమయింది. రావణుడు పరమేశ్వరుణ్ణి వరమడిగి కృతార్థుడయ్యాడు.

''తూలాదపి యాచకః'' అన్నట్లు లోకంలో యాచించేవాడు దూదికంటె తేలిక, చులకన అయిపోతాడు. చేయి చాచి అడుగడం దైన్య లక్షణం. కాబట్టి కోరిక తీర్చినవారికి కూరిమి కూర్చడం ఆనవాయితీ. రావణుడు ముల్లోకాలనేలే సుఖంకన్నా మిన్న అయిన హైమవతి ఆలింగన సుఖాన్ని ముక్కంటికి కలిగించి అతని మురిపెం తీర్చాడు. వరం యాచించి దైన్యాన్ని ప్రకటించిన దోషాన్ని, ఈ వినిమయ వ్యవహారంతో విదలించుకున్నాడు రావణుడు.

వినిమయమంటే పరివృత్తి. ఒక్క వరం ఇచ్చిన వానికి అధిక సుఖాన్ని లభింపచేశా దనడం పరివృత్త్యలంకారం.

8\. సబాల ఆసీద్వా వపుషా చతుర్భుజో
ముఖేన పూర్ణేందునిభస్త్రిలోచనః
యువాకరాక్రాంత మహీభృదుచ్చకై
రసంశయం సంప్రతి తేజసా రవిః. (1-70)

నారదుడు శిశుపాలుని రూపసంపదను ఇలా వివరించాడు :—

''బాల్యంలో శిశుపాలుడు శరీరంచేత చతుర్భుజుడు. ముఖంచేత పూర్ణ చంద్రునితో సమానుడు. అంతేకాదు, మూడు కన్నూ ఉన్నవాడు. ఇప్పుడతడు యౌవనంలో ప్రతాపంచేత కరాక్రాంత భూభర్త అయిన సూర్యుడే. సందేహం లేదు.''

కరములంటే చేతులు, కిరణాలు, పన్నులు అని అనేకార్థాలు. మహీభృత్ అనే శబ్దానికి రాజులు, పర్వతాలు అని రెండర్థాలు. పదార్థాల రసద్రవ్యాన్ని తన కిరణాలతో పీల్చి పిప్పిచేసేవాడు రవి.

నారదుడు శిశుపాలుని స్వరూపంతోపాటు స్వభావాన్నీ విశదపరచాడు. శరీరంలో అవయవాలు తక్కువ ఉన్నా, ఎక్కువ ఉన్నా ఆకారం శ్రీకార మనిపించదు. శిశుపాలుడు కృష్ణునివలె నాలుగు చేతులతో పుట్టాడు కాబట్టి విష్ణు మూర్తి అనుకుందామా అంటే శివునికివలె మొగాన మూడు కళ్ళు ఉన్నాయి. అయినా చంద్రబింబంలాంటి ఆ బాలుని మొగం చూడడానికి కొంత వింతగా ఉండేది. ఆ బాలుడు శ్రీకృష్ణుని చేతుల్లోకి రాగానే అధికంగా ఉన్న అతని చేతులు అంతరించాయి.

''చండమారుతమివ ప్రదీపవచ్ఛేదపస్య నిరవ ద్విలోచనమ్.'' (శిశు. 14/85) గాలికి దీపంలాగా అతని మూడవ కన్ను అప్పుడే చప్పున ఆరిపోయింది.

ఇక ఇప్పుడైతే రాజులందరినీ అప్రకవిక్రమంతో వశపరచుకున్న నవ యువకుడాతడు. అంతేకాదు, కొండలరాయళ్ళ గుండెలమీద ప్రతాపంతో ప్రజ్వరిల్లే ప్రచండమార్తాండుడే అనడంలో అనుమానించ పనిలేదు, అంటాడు నారదుడు.

పుట్టడమే వింత అయితే కొంతకాలం అందరికి అదే చింత. ఆకారమే వికారం, అయినా అది స్వభావానికి సంకేతం. హరిహరాదుల, అనేక దేవతా మూర్తుల మహిమలు ఉండడంవల్ల ఇప్పుడతడు దుర్నిరీక్ష్యుడూ, దుర్ధర్షుడూ అయ్యాడు.

*9.* *సర్వకార్య శరీరేషు ముక్త్వాంగ స్కంధ పంచకమ్.*
*సౌగతానామివాత్మాన్యో నాస్తిమంత్రో మహీభృతామ్.*
*(2-28)*

ధర్మరాజు చేసే యాగానికి పోవడమో, శిశుపాలునిపై దండెత్తడమో-నిర్ణయించలేని సందిగ్ధ పరిస్థితిలో ఉన్న శ్రీకృష్ణుడు అడుగగా, బలరాముడు తన అభిప్రాయం ఇలా ప్రకటించాడు:

"బౌద్ధులకు స్కంధ పంచకం కంటె వేరే ఆత్మ లేనట్లే రాజులకు అంగ పంచకంకంటె వేరే మంత్రం లేదు." ఇది రాజనీతి.

'స్కంధ పంచకం' అంటే రూప వేదనా విజ్ఞాన సంజ్ఞా సంస్కారాలు.

1. ప్రపంచంలో కంటికి కనబడే సమస్త వస్తువుల ఆకార విశేషమే 'రూప స్కంధం.'
2. కన్ను, ముక్కు, ముఖం మొదలైన అవయవాలతో ఆకార విశేషాల అనుభవాలను తెలుసుకోవడం 'వేదనా స్కంధం.'
3. తెలిసిన విషయాన్ని మరవక, నిరంతర ధారా ప్రవాహంలా అనువర్తించుకున్న జ్ఞాన పరంపర 'విజ్ఞాన స్కంధం.'
4. చేతన, అచేతన పదార్థాల పేళ్ళు 'సంజ్ఞా స్కంధం.'
5. మనస్సులో గూడు కట్టుకున్న వాసన, శాస్త్ర నియమానుసారం శరీరాన్ని భూషించడం - చర్మం, కమండలువు, క్షౌరం, కుట్టనిబట్ట ధరించడం, పూర్వాహ్ణ భోజనం, సంఘం, రక్తాంబరత్వం లాంటి వాటిని పాటించడం 'సంస్కార స్కంధం.'

ఈ స్కంధాలు ఒకదానికొకటి కార్యమూ, కారణమూ అవుతాయి. ఈ అయిదు విధాలుగా పరివర్తనమయ్యే జ్ఞాన సంతానమే 'ఆత్మ.' ఇది బౌద్ధ మత సమ్మతం.

రాజులకు కార్యసిద్ధికి సహాయపడే అంగ పంచకం :-

1. కార్యాన్ని ఆరంభించే ఉపాయం.
2. కార్యసిద్ధి కోసం ఉపయోగపడే వస్తువులనూ, సాధనాలనూ సమకూర్చు కోవడం.
3. దేశాన్నీ, కాలాన్నీ సముచితంగా విభజించడం.
4. ఆపదలను నివారించే ఉపాయం.
5. కార్యసిద్ధి పొందడం.

ఈ అయిదు అంగాలను గూర్చి క్షుణ్ణంగా ఆలోచించడమే మంత్రాంగం.

'సర్వం క్షణికం, సర్వం శూన్యం, సర్వం దుఃఖం' అని జాతిని నిర్వీర్యం చేసే జీవిత నైరాశ్యాన్ని బోధించి, నివృత్తికి దారి చూపడానికి ఈ స్కంధపంచకమే ఆధారం.

'పురుషార్థమే జీవగఱ్ఱ' అని ధర్మవీరాన్ని నూరిపోసి, ప్రవృత్తిమార్గంలో జీవితాశామాధుర్యాన్ని చవి చూపి, జాతిని కర్తవ్యోన్ముఖంగా మలచడానికి అంగపంచకమే శరణ్యం.

కాబట్టి శిశుపాలునిపై దండయాత్ర చేయడానికి మనకిప్పుడు తగినంత బలం ఉంది అంటాడు బలరాముడు.

**10.** *సమూల ఘాత మఘ్నంతః పరాన్నోద్యంతిమానినః,*
*ప్రధ్వంసితాంధతమస స్తత్రోదాహరణం రవిః.* **(2-33)**

పరాక్రమిస్తేనే అభ్యుదయం కలుగుతుందని బలరాముడంటాడు. "అభిమానం ఉన్నవారు పరాక్రమంతో శత్రువులను నిర్మూలించకుండా అభ్యుదయం పొందలేరు. ఉదయించకముందు గాఢాంధకారాన్ని ధ్వంసంచేసే భాస్కరుడే ఇందుకు ఉదాహరణం."

చీకటిని చీల్చి సూర్యుడు ఉదయించినట్లే పగవారిని పగులజీరి ప్రతాపవంతుడు ప్రకాశిస్తాడని ఉక్తివైచిత్రి. ఇట్టి భావాన్నే భారవి భీముణ్ణి ఓదార్చే ధర్మరాజు ద్వారా వెల్లడించాడు.

"అవిభిద్య నిశాకృతంతమః,
ప్రభయానాంశుమతాఽప్యుదీయతే" (కిరా- 2-36)

'రాత్రి చిక్కగా పులిమిన చీకటిని సూర్యుడు తన ప్రభచేత భేదించ కుండా ఉదయించడు.'

రాజనీతి ప్రసక్తిలోనూ, రెండు ప్రతిషేధాత్మక పదాలను ప్రయోగించి అర్థగౌరవమున్న వాక్య రచనలోనూ, భావసామ్యంలోనూ, తనకు పూర్వుడైన భారవిపై స్పర్థ ఉన్నదని మాఘకవి ఈ శ్లోకంతో తెలియపరచాడు.

ఉభయుల భావస్వామ్యం ఉత్తరార్థంలోనే ప్రతిబింబించింది. భారవి రచనలో ప్రసజ్యప్రతిషేధాత్మకమైన వాక్యం ఉపమానంలో – ప్రతిబింబంలో గోచరిస్తే, మాఘకవి రచనలో అది ఉపమేయంలో – బింబంలోనే ఉండడం విశేషం. అది వారి సౌందర్యానుభూతి - ఏమైనా, అనంతరీయునికి అవకాశం అధికం కదా!

**11.** *సఖా గరీయాన్ శత్రుశ్చ కృత్రిమ సాహికార్యతః.*
*స్యాతా మమిత్రౌ మిత్రేచ సహజప్రాకృతావపి.* **(2-36)**

శిశుపాలుడు ఒక్కడు మనలనేంచేస్తాడు? అనుకోరాదని అతని బలం చెప్ప డానికి సామాన్యంగా మిత్రులెవరో, శత్రువులెవరో ఇలా వివరించాడు బలదేవుడు:

''చేసే పనులనుబట్టి కృత్రిమ మిత్రులూ, కృత్రిమ శత్రువులూ బలవంతులనడం ముఖ్యం. సహజ, ప్రాకృత మిత్రులు, శత్రువులు కూడా కార్యానిబట్టి మిత్రులూ, శత్రువులూ అవుతారు.''

మిత్రులుగానీ, శత్రువులుగానీ సహజ, ప్రాకృత, కృత్రిమ భేదంతో మూడు విధాలుగా ఉంటారు. ఇందులో—

1. సహజ మిత్రులు :- మేనత్త మేనమామ కొడుకులు
 సహజ శత్రువులు :- తండ్రితోబుట్టువు, ఆయన పుత్రులు
2. ప్రాకృత మిత్రుడు :- పొరుగు దేశానికి పొరుగున ఉన్న దేశపతి
 ప్రాకృత శత్రువు :- పొరుగున ఉన్న దేశాధిపతి.
3. కృత్రిమ మిత్రులు :- సామదానాద్యుపాయాలతో, ఉపకార కార్యాలతో స్నేహమేర్పడ్డ వ్యక్తులు
 కృత్రిమ శత్రువులు :- అపకారంచేసిన-లేక, చేయబడ్డ వ్యక్తులు

వీరిలో సహజ, ప్రాకృత మిత్రులు అపకారకృత్యంతో శత్రువులుగానూ, సహజ, ప్రాకృత శత్రువులు ఉపకారకృత్యంతో మిత్రులుగానూ మారే అవకాశం ఉంటుంది. కృత్రిముడు ఉపకారాపకారాలనుబట్టి మిత్రుడు మిత్రుడే. శత్రువు శత్రువే. సహజ ప్రాకృత కృత్రిమాలలో కృత్రిమత్వం అపవాదం.

మేనత్త కొడుకు శిశుపాలుడు, సహజ మిత్రుడైనప్పటికీ అపకారం చేసి కృత్రిమ శత్రువయ్యాడు. కాబట్టి సంధి చేయతగని వాడని భావం.

12. తుంగత్వ మితరానాద్రౌ నేదం సింధా వగాధతా.
అలంఘనీయతా హేతు రుభయం తన్మనస్విని. (2-48)

ఇవి కూడా బలరాముని మాటలే.

''పర్వతానికి ఔన్నత్యం ఉంది కాని గాంభీర్యం లేదు.

సముద్రానికి గాంభీర్యం ఉంది కాని ఔన్నత్యం లేదు.

కాని మనిషికి లంఘింపరాని గాంభీర్యౌన్నత్యాలు రెండూ ఉన్నాయి.''

పర్వతమైనా, పారావారమైనా, రెండూ అసమగ్రం, అసంపూర్ణమే. మనస్సు ఎంత లోతైనదో అంతఎత్తైనదికూడా. ఆ మనస్సు ఉన్నవాడే మనస్వి. కాబట్టి లంఘింప తగనివాడు, అవమానింప తగనివాడు. మానవుడు. ధీరుడు. అద్రికంటె అబ్ధికంటె మానవుడు అధికుడు, పౌరుషవంతుడు.

శ్రీకృష్ణుడు రుక్మిణీదేవిని హరించి శిశుపాలుణ్ణి ఒక్కసారి పరాభవిస్తే, అతడు అనేక పర్యాయాలు ద్రోహం చేశాడు. నరకాసురుని మీదికి శ్రీకృష్ణుడు యుద్ధానికి పోయినప్పుడు, శిశుపాలుడు ద్వారకను ముట్టడించాడు. బభ్రుడనే యాదవుని భార్యను ఎత్తుకపోయాడు. ఊరుకున్న కొద్దీ అతడు మించిపోతున్నాడు, అని బలరాముని అభిప్రాయం.

'సముద్ర ఇవ గాంభీర్యే' అని ఉపమాలంకారానికి ఊటబుగ్గ అయిన వాల్మీకి రామాయణం మానవుని గుణాలను మహా పదార్థాలతో పోల్చి వర్ణించింది.

ఒక్క గుణం ఉన్నంతనే అచేతనమైన పర్వతంగానీ, పాథోధిగానీ తనను అధిగమింపనీయదు కదా! గభీరుడూ, మహోన్నతుడూ అయిన శ్రీకృష్ణుడు, అనేక అపరాధాలు చేస్తూ మించిపోతున్న శిశుపాలుణ్ణి ఉపేక్షించక, అతనిపై దండెత్తడం తక్షణ కర్తవ్యం; అంటూ వ్యతిరేకాలంకార వాక్యాలతో పౌరుషాన్ని ప్రశంసిస్తాడు బలరాముడు.

13. ప్రజ్ఞోత్సాహావతస్స్వామీ యతేతాధాతు మాత్మని,
తౌహి మూలముదేష్యంత్యా జిగీషోరాత్మ సంపదః.
(2-76)

శ్రీకృష్ణుని కోరిక మేరకు బలరాముని తర్వాత ఉద్ధవుడు కూడా తన అభిప్రాయాన్ని ఇలా వెల్లడించాడు :

''విజయాభిలాషికి మంత్రశక్తీ, ఉత్సాహశక్తీ, రెండూ ఉండాలి. ఈ రెండు ముందుకలిగే ప్రభుశక్తికి ప్రధాన కారణం.''

మంత్ర, ఉత్సాహ, ప్రభుశక్తులని శక్తులు మూడు. బుద్ధి వాడిఅయిన బాణంలాంటిది. అది సూక్ష్మంగా ప్రవేశించి, విషయాన్ని లోతుగా స్పృశిస్తుంది. కార్యసాధన కోసం మంచిచెడ్డలను సర్వంకషంగా ఆలోచించే ప్రజ్ఞయే మంత్ర శక్తి. ఇది ధీర లక్షణం. సాహసంతో కార్యానికి శీఘ్రంగా యత్నించడం ఉత్సాహశక్తి. ఇది వీరలక్షణం. ధన సంపదనూ, చతురంగ బలసంపదనూ సమగ్రంగా సంపాదించడం ప్రభుశక్తి. ఇది స్వామి లక్షణం.

మంత్రశక్తి వేరు వంటిది. ఉత్సాహశక్తి చెట్టు వంటిది. దాని ఫలమే ప్రభుశక్తి. కేవలం ఉత్సాహం ఫలించదు. వేరుకు హానికల్గితే చెట్టు ఎండిపోయి పండదు. అంతశ్శక్తి మంత్రం, బాహ్యశక్తి ఉత్సాహం. ఈ రెంటినీ చక్కగా పోషిస్తే ఫలం ప్రభవించి, అనుభవానికి వస్తుంది. కాబట్టి ప్రజ్ఞ, ఉత్సాహం ప్రభుశక్తికి మూలం, అంటాడు ఉద్ధవుడు.

**14** *నాలంబతే దైష్టికతాం న నిషీదతి పౌరుషే,*
*శబ్దార్థౌ సత్కవిరివ ద్వయం విద్వా నపేక్షతే. (2-86)*

ఇవికూడా ఉద్ధవుని మాటలే.

''రాజనీతిజ్ఞుడు దైవంమీద ఆధారపడడు. అంతా పౌరుషమే అనీ భావించడు. సత్కవికి శబ్దమూ, అర్థమూ, అవసరమైనట్లే రాజనీతి వేత్తకు దైవమూ, పౌరుషమూ రెండూ అవసరమే'' - అంటాడు ఉద్ధవుడు.

'దైష్టికత' అంటే పూర్వజన్మల్లో చేసిన ప్రయత్నం. మనకది తెలియదు; అగుపడదు. కాబట్టి పురాకృతశుభాకర్మనే 'దైవ' మనీ, 'అదృష్ట'మనీ అంటాం. ఈ జన్మలో చేసే ప్రయత్నమే 'పౌరుషం.' అంతా దైవికమే అని ప్రయత్నించనివాడు చెడిపోవచ్చు. కేవలం పౌరుషమే ప్రధానం అనుకున్న వ్యక్తి ప్రయత్నించినా విఫలుడు కావచ్చు. ఏ కార్యానికైనా కాలం, అదృష్టం కలిసివస్తే ఆశయాలు అవలీలగా నెరవేరుతాయి.

''ప్రాక్తనోఽద్యతనే నాశు పురుషార్థే న జీయతే"...

''అతః పురుషయత్నేన యతితవ్యం యథా తథా'' అని యోగవాసిష్ఠం స్పష్టం చేసినట్లు 'దైవపౌరుషాలలో ప్రబలమైనదే ముందుకు దూసుకొనివచ్చి ప్రయోజనకారి అవుతుంది. కాబట్టి మానవుడు దైవపరుడేకాక ప్రయత్నశీలుడూ కావాలి.'

సత్కవి అంటే తర్కకర్కశమైన శాస్త్రార్థాన్నికూడా సమాజానికి హితంగా, మృదుమధుర పదసహితంగా, రసమహితంగా వర్ణించే విద్వత్కవి.

కవికి శబ్దసాధుత్వం, అర్థసంపద రెండూ ఉండాలి.

కవికర్మ కావ్యం. కావ్య వ్యవహారం శబ్దార్థాలు రెండింటిపై ఉంటుంది. శబ్దంలేని అర్థం వ్యక్తంకాదు. అర్థరహితమైన శబ్దం వ్యర్థం. జాతిగుణ క్రియలలో ఏ ఒక్క సంకేతమైనా తెల్పని 'డిత్థ, డవిత్థ' శబ్దాలు ఎన్ని శతాబ్దాలైనా నిరర్థకాలే.

"తదధీతే" అంటే 'కావ్యం చదివెను' అని శబ్దాన్ని పరిశీలించి, ఈ శబ్దానికి ఈ అర్థం అని గ్రహిస్తాడన్నమాట. కవి నిర్మించే కావ్యం ఒక్కటే అయినా, అందులో శబ్దార్థాల ప్రవృత్తి ఉంటుంది.

ఈ శ్లోకంలో దైవ పౌరుషాలు శబ్దార్థాలతో పోల్చబడినాయి. ఈ శబ్ద ప్రధానం వైదికం. అది దైవికం. ఋషులు విన్నది కాబట్టి అది శ్రుతి.

అర్థ ప్రధానం స్మృతీతిహాస పౌరాణికం. స్మరిస్తే ఇది నిత్యనూతనంగా పురుషార్థసాధకం. ఉక్తి ప్రధానం కావ్యం. వేదపురాణాల, అంటే శబ్దార్థాల ప్రవృత్తినీ ప్రతిభతో రసమయంచేసే వాక్పాకం. 'వాక్యం' చక్కగా మలచడం వల్లనే కదా 'కావ్యం.' వాక్యానికి శబ్దం, అర్థం ఈ రెంటితోనే విశేషసంబంధం. అందువల్లనే గుణాలూ, అలంకారాలూ, వ్యంగ్య వైభవాలూ స్ఫురిస్తాయి. కాబట్టి శబ్దార్థాలవలె దైవ పౌరుషాలు కూడా పరస్పర సాపేక్షకాలు.

ఈ శ్లోకంలో విద్వాన్ శబ్దప్రయోగం రాజనీతిజ్ఞుడూ అయిన మాఘ మహాకవి వైదుష్యాన్ని భంగ్యంతరంగా ప్రకటిస్తున్నది.

**15.** *అనుత్సూత్ర పదన్యాసా సద్వృత్తి స్సన్నిబంధనా,*
*శబ్ద విద్యేవ నోభాతి రాజనీతి రపస్పశా.* **(2-112)**

ఇది కూడ ఉద్ధవుని అభిప్రాయమే.

"అనుత్సూత్ర పదన్యాసమూ, సద్వృత్తీ, సన్నిబంధనమూ కల రాజనీతి, అపస్పశ అయిన శబ్ద విద్యవలె శోభించదు."

గూఢచారుల పంపడం అవసరం, అని చెప్పి శబ్దశాస్త్రం వంటిది రాజనీతి అంటాడు ఉద్ధవుడు.

చిన్న, పెద్ద ఉద్యోగులందరూ నియమాలకు విరుద్ధంగా ఒక్క అడుగైనా ముందుకు వేయరానిది రాజనీతి. తగిన జీతం పని పూర్తిగా తృప్తిగా చేసిన కార్యకర్తలకు శాశ్వతంగా భూమీ, ధనమూ, పారితోషికంగా ఇచ్చే నియమావళి

గల వ్యవస్థ రాజనీతి. ఇన్ని గుణాలున్నా, గూఢచారులను నియోగించకపోతే రాజనీతి శోభించదు.

పాణిని రచించిన వ్యాకరణ సూత్రాలకు విరుద్ధంగాలేని న్యాసగ్రంథమూ, కాశికావృత్తి గ్రంథమూ, మహాభాష్యగ్రంథమూ వ్యాకరణశాస్త్రంలో ఉన్నాయి. ఇన్ని ఉన్నప్పటికీ 'రక్షో హాగమలఘ్వ సందేహాః ప్రయోజనమ్' అని వ్యాకరణ ప్రయోజనాన్ని సమర్థించే 'పస్పశం' అనే ఉపోద్ఘాత గ్రంథం చదువకపోతే శబ్దశాస్త్రం శోభించదు.

"సూచనాత్ సూత్రమ్" తక్కువ శబ్దాలతో ఎక్కువ అర్థాలను సూచించేది సూత్రం, అని సూత్ర లక్షణం.

"పదం శేషాహి విరచితం భాష్యమ్" పదం అంటే పతంజలి మహాభాష్యమని వల్లభదేవుని వ్యాఖ్యానం. 'సన్నిబంధనం' అంటే భాష్య గ్రంథమని మల్లినాథుడు. సూత్రాల వ్యాఖ్యానానికి 'వృత్తి' అని పేరు. ముఖ్యంగా వ్యాకరణ శాస్త్ర ప్రవృత్తియే వృత్తి శబ్దానికి అర్థం. కాశికావృత్తిని పేర్కొన్నాడు మల్లినాథసూరి. అయితే మహాభాష్యానికి వ్రాసిన వృత్తి 'కాశికావృత్తి.' ఈ వృత్తిపై వ్రాసిన వ్యాఖ్యాన గ్రంథమే 'న్యాసం' దీన్ని జినేంద్రబుద్ధి అనే బౌద్ధ పండితుడు వ్రాశాడు. మాఘ కవి కంటె పూర్వకాలంలో 'క్షపణక మహాన్యాస' మనీ, 'జైనేంద్రన్యాస' మనీ తదితర వ్యాకరణ వృత్తి వ్యాఖ్యాన గ్రంథాలుండేవని విజ్ఞులంటారు.

'పస్పశం'- అంటే పాణిని వ్రాసిన అష్టాధ్యాయికి పతంజలి మహర్షి రచించిన మహాభాష్యంలోని ప్రథమాహ్నికం. దీన్నే 'పస్పశాహ్నికం' అంటారు.

గూఢచారులు లేకపోతే రాజులు అంధప్రాయులే. అందుకే రాజులను చారచక్షువులంటారు.

'అపస్పశ'- అంటే స్పశుడు (చారుడు) లేని, అని ఒక అర్థం పస్పశం లేని, అని మరొక అర్థం. ఇది శబ్దశ్లేష. ఇక అర్థశ్లేషకు సంబంధించినవి 'సద్వృత్తి, సన్నిబంధన' అనేవి. 'అనుత్సూత్ర పదన్యాసా' అనేది శబ్దార్థోభయశ్లేష. మాఘ కవి శబ్దశాస్త్రాన్ని రాజనీతితో ఉపమించి కవితను కృతార్థం చేశాడు.

**16.** యఇహాత్మవిదో విపక్షమధ్యే
సహసం వృద్ధియుజోఽపి భూభుజస్స్యుః,

బలిపుష్టకులా దివాన్యపుష్టైః
పృథగస్మా దచిరేణ భావితా తైః. (2-116)

ఉద్ధవుడు శ్రీకృష్ణునితో పలికిన మాటలివి:

''శ్రీకృష్ణా! అంతవరకు శిశుపాలునితో కూడి ఉండి, ఐశ్వర్యవంతులైన నీ పక్షం వారందరు, యజ్ఞంలోనే తమ స్వరూపం తెలుసుకొని, కాకుల గుంపు నుంచి కోకిలల గుంపువలె శిశుపాలుని నుంచి వేరౌతారు.''

యజ్ఞంలోనే రణ యజ్ఞానికి అవకాశం ఉంటుందని ఉద్ధవుని సూచన. భేదోపాయకల్పన ఇది.

ఉద్ధవుడు పెద్దవాడు. బుద్ధిలో బృహస్పతి. కాబట్టి అతడు ''వైరాయితా రస్తరకా స్స్వయం మత్సరిణః పరే'' అని ఊహిస్తాడు. ''శ్రీకృష్ణా! ధర్మరాజు నిన్ను భక్తితో పూజిస్తాడు. అసూయాపరులు దాన్ని సహించక నీతో విరోధిస్తారు. నీవు పంపిన గూఢచారులు నీ శత్రురాజుల సేవకులై, రెండువైపుల జీతాలు పొందుతూ, మర్మజ్ఞులై నీ శత్రురాజులకూ, వారి మంత్రులకూ, సామంతులకూ, లేఖలు కల్పించి భేదబుద్ధి పుట్టిస్తారు. ఇక నీ మిత్రరాజులు కూడా శిశుపాలునితో కపటవృత్తిచే కలిసి బలిసిపోతారు.

''కోకిల పిల్లలను కాకులు పెంచి పెద్దచేస్తాయి. కాని రెక్కలు వచ్చిన వెంటనే అవి కాకులమూకను విడిచిపెట్టి, తమ గుంపులో కలుస్తాయి.

''అల్లే నీ శత్రువులతో కలిసిన రాజులూ, భిన్న మనస్కులైన మంత్రులూ, సామంతులూ యుద్ధం ఆరంభం కాగానే, యథార్థం గ్రహించి, విపక్షులనుంచి విడిపోయి, నీ పక్షం చేరి నీకు సహాయపడతారు.''

కాకి కోకిలల భేదం కంఠస్వరంతోనే తెలుస్తుంది. కాబట్టి శిశుపాలునికి కాకివలె వాక్పారుష్యమూ ఉన్నదని సూచిస్తూ, ధర్మరాజు చేసే యాగంలో శ్రీకృష్ణుడు పాల్గొనడం ఉభయతారకం అంటాడు ఉబ్బసమున్న ఉద్ధవుడు.

**17.** చిత్రాభి రస్యోపరి మౌళి భాజాం
భాభిర్మణీనా మనణీయ సీభిః,
అనేక ధాతుచ్ఛురితాశ్మ రశ్మే
ర్గోవర్ధన స్యాకృతి రన్వకారి. (3-4)

శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థ యాత్ర చేయడానికి నిశ్చయించుకొని కిరీటాన్ని అలంకరించుకున్న సన్నివేశమిది.

"శ్రీకృష్ణుడు కిరీటాన్ని ధరించాడు. గొప్ప గొప్ప రకరకాల రంగుల రత్నాల కాంతులతో ప్రకాశించే ఆ కిరీటం, గైరికాది ధాతువులతో మిశ్రితమైన పలురకాల రాళ్ళ వెలుగు లెగజిమ్మే గోవర్ధన పర్వతాన్ని అనుకరించింది.''

ఈ శ్లోకంలో ఉన్నదంతా ఉపమాలంకార సౌందర్యం. కిరీటం గోవర్ధన పర్వతాన్ని అనుకరించిందనగానే ఇంద్రధ్వజ మహోత్సవంలో గోపకులు తెచ్చిన పూజాద్రవ్యాలు శ్రీకృష్ణుడు స్వీకరించడమూ, మాత్సర్యంతో శతమఖుడు అతివర్షం కురిపించడమూ, గోవర్ధనగిరిని నెత్తిమీద ఎత్తుకొని ఆబాలగోపాలాన్ని కాపాడిన ఆ బాలగోపాలుడు మన కళ్ళముందు తళుక్కున మెరుస్తాడు.

కిరీటం గోవర్ధన గిరిలా ఉంది. ఎంత భారం!! అయినా అతనికి అది అలంకారం.

శ్లోకంలోని 'భ' వర్ణ 'ర' వర్ణాల పూత ఉద్దిష్టభావానికి ఊత. కిరీట ధారణంలోక కల్యాణ కారణం. జరుగబోయే ధర్మరాజ రాజసూయ యాగ రక్షణా, శిశుపాలుని శిక్షణా కిరీట ధారణంచే స్ఫురిస్తున్నాయి. అపరాధుల శిక్షించి, ఆశ్రితుల రక్షించడం జనార్దనుని సౌజన్యం. కాబట్టి గోవర్ధనగిరి సాదృశ్యం అనన్య సామాన్యం.

ఇది సహృదయ చిత్తభిత్తిపై సుందరంగా చిత్రితమైన దృశ్యం. ఈ శ్లోకంలో మొదటి రెండక్షరాలు 'చిత్రా'; చివరి రెండు అక్షరాలు 'కారి'. ఈ రెంటిని కలిపితే 'చిత్రాకారి' అవుతుంది. చిత్రమైన ఆకారంగల శ్రీకృష్ణుడు కనిపిస్తాడు.

*18.* *రరాజ సంపాదక మిష్టసిద్ధే*
*స్సర్వాసు దిక్ష్వ ప్రతిషిద్ధ మార్గమ్,*
*మహారథః పుష్యరథం రథాంగీ*
*క్షిప్రం క్షపానాథ ఇవా ధిరూఢః.* *(3-22)*

శ్రీకృష్ణుడు రథము నధిరోహించిన సందర్భంలోని వర్ణన ఇది.

''మహారథుడూ, చక్రీ అయిన శ్రీకృష్ణుడు, కోరిక తీర్చేదీ, ఏ దిక్కైనా నిరాటంకంగానూ వేగంగానూ పోయేదీ అయిన పుష్యరథం మీద, క్షిప్రం అనే నక్షత్రం మీద చంద్రునిలా ఆరోహించి ప్రకాశించాడు.''

'మహారథుడు' అంటే తననూ, సారథినీ, గుర్రాలనూ కాపాడుకుంటూ యుద్ధం చేసేవాడు.

విలాసంగా విహరించడానికి వాడుకునే క్రీడారథాన్ని 'పుష్యరథం' అంటారు. పుష్యమీ నక్షత్రానికి సంకేతం 'క్షిప్రం'.

ఇందులోని ఉపమాలంకారం జ్యోతిశ్శాస్త్రానికి సంబంధించింది.

''పుష్యస్సర్వార్థ సాధకః'' అన్నట్లు పుష్యమీ నక్షత్రం ఉన్న సమయంలో పయనించేవారికి పనులన్నీ నిరాటంకంగా నెరవేరుతాయి.

పుష్యమీయుక్త చంద్రుడు అంటే కర్కాటక రాశిలో ఉండే చంద్రుడు. ఆ చంద్రుడు ఓర్పు కలవాడు, కీర్తికరుడు, జయప్రదుడు కూడా.

మహారథుడే అయినా శ్రీకృష్ణుడు యుద్ధానికి పోవడం లేదు కాబట్టి ముద్దుగా పుష్యరథం అధిరోహించాడు. కాలానికి తగినట్లు జీవులమ త్రిప్పేవాడు కాబట్టి శ్రీకృష్ణుడు రథాంగి. అంటే చక్రం కలవాడు. ఓర్పూ నేర్పూ చూపించే తారాబలమూ, చంద్రబలమూ, అన్నీ సహజ సిద్ధంగా సమకూరి ప్రయోజనాన్ని సాధింపజేయనున్నట్లు ఈ శ్లోకంలోని ఉపమాలంకారం స్ఫురింపజేస్తున్నది.

ధర్మనక్షత్రమైన పుష్యమికి అధిపతి గురువు. కర్కాటకరాశి చంద్రునికి స్వక్షేత్రం. కాల పురుషునికి కర్కాటకం హృదయం. చంద్రుడు అతని మనస్సు. చిత్తం చిత్తంలోనే అంటే ఒకేచోట ఉండడం ధీరలక్షణం.

చంద్రుడు ఛాయాగ్రహం, కాబట్టి ముందుకు సింహరాశినీ, వెనుకకు మిథునరాశినీ చూసే గుణం అతనికి ఉంటుంది.

శ్రీ కృష్ణుడు ధర్మకార్య నిర్వహణలో ఒకటీ, రెండూ అని మీన మేషా లెంచుతూ, ప్రమాదపడకుండా, ప్రమాణంగా ప్రవర్తించి, రాశికి వచ్చి వాసికెక్కే బలం కూడా ఈ ముహూర్తంలో ఉంది.

ఒక్కచిన్న ఉపమానంలో మాఘకవి ఇంతటి మహార్థాన్నిచ్చే ముహూర్తాన్ని నిక్షేపించాడు.

**19.** *వణిక్పథే పూగకృతాని యత్ర*
*భ్రమాగతై రంబుభి రంబురాశిః,*
*లోలై రలోల ద్యుతిభాంజి ముష్ణ-*
*ర్త్నాని రత్నాకరతా మవాప.* **(3-38)**

ఇంద్రప్రస్థానికి శ్రీ కృష్ణుడు బయలుదేరే సందర్భంలో కవి చేసిన ద్వారాకా నగరవర్ణన మిది.

''ద్వారకా నగర వీథుల్లో కాంతులీనే మంచిరత్నాలరాసులున్నాయి. పట్టణంలో ఉన్న నీటి కాలువలద్వారా ఆ రత్నాలు కొట్టుకవస్తున్నాయి. సముద్రుడు

నీరు మాత్రమే సారంగాకలవాడు. అయినా, కాలుపలగుండా రత్నాలను దొంగిలించడంవల్లనే ఆతడు రత్నాకరుడయ్యాడు.''

సముద్రంలో రత్నాలుండడంవల్ల సముద్రానికి రత్నాకరుడని పేరు. ఇది సహజం. ఇలా సముద్రానికీ రత్నాలకూ సహజంగా సంబంధమున్నప్పటికీ నగర వీథీ రత్నాలను దొంగిలించడంవల్లనే ఆతడు రత్నాకరుడయ్యాడనడం, ఉన్న సంబంధాన్ని లేదని చెప్పడమే. ఇలా చెప్పడం అతిశయోక్తి అలంకారం.

సంద్రంలోకన్నా రత్నాధిక్యం ద్వారకలోనే మిన్న అని కవి నగర సంపదను వర్ణించాడు.

**20.** చిత్రంసయా కృత్రిమ పత్త్రి పంక్తేః
కపోతపాళీషు నికేతనానామ్,
మార్జార మప్యాయత నిశ్చలాంగం
యస్యాం జనః కృత్రిమ మేవ మేనే. (3.51)

ఇది కూడా ద్వారకానగర వర్ణనమే.

"ద్వారకలో కన్నుల చెన్ను చెదిరే అందాల మందిరాలెన్నో ఉన్నాయి. అందులో అమర్చిన పావురాల పాలికల్లో అనల్పమైన శిల్పంతో గండరించిన కొయ్య పావురాలున్నాయి. ఆ కృత్రిమ పావురాలను పట్టుకోవడానికి ఒక పిల్లి ఒళ్ళు పెంచి పొంచి ఉంది. నయనాభిరామంగా ఉన్న ఈ దృశ్యాన్ని చూసే నాగరికులు 'ఇది కూడా కృత్రిమమైనదే' అనుకున్నారు.''

ఇది వాసికెక్కిన వాస్తుకళాకౌశలం. 'పావురాలు నిజమైనవే' అన్న భ్రాంతి పిల్లికి కలిగింది. ఆ 'పిల్లికూడా కృత్రిమమైనదే' అన్న భ్రాంతి మతి ఉన్న మానవులకూ కలిగింది.

ఎంత చూసినా వింతే. ఏది కృత్రిమం? ఏది అకృత్రిమం? ఏది జీవం? ఏది నిర్జీవం? అని తెలియక తికమకపడడమా? కాదు. మరేమి? లోకులు కృత్రిమాన్ని అకృత్రిమంగా, అకృత్రిమాన్ని కృత్రిమంగా భావించి, డెందంలో కందళించే ఆనందాన్ని అనుభవించడం జీవిత సత్యం. విపరీత బుద్ధి పుట్టడమే భ్రాంతి. ఇది ఒక అలంకారం.

ఇది చేయి తిరిగిన శిల్పం. ''చిత్రంవా ఏతత్కర్మ'' అని ప్రతి పలికినట్లు, సృష్టిలో విషమ దృష్టిని విదళించడానికి కళాకారులు చేసే ప్రతిసృష్టి.

21. పరస్పర స్పర్ధి పరార్థరూపాః
పౌరస్త్రియో యత్ర విధాయ వేధాః,
శ్రీ నిర్మితి ప్రాప్త ఘుణక్షతైక
వర్ణోపమావాచ్య మలం మమార్జ. (3-58)

ద్వారకానగర కాంతల వర్ణన మిది.

"ద్వారకలో ఉన్న స్త్రీలు అందంలో పరస్పరం పోటీపడే రూపవతులు. వీరిని సృష్టించి బ్రహ్మ, 'అందాల బరిణిగా లక్ష్మీదేవిని సృజించడం కేవలం ఘుణాక్షర న్యాయమే' అన్న నిందను, నివారించుకున్నాడు."

ఒక నుసిపురుగు కర్రను తొలిచివేస్తే, అది ఏదో ఒక అక్షరంగా ఏర్పడిన రీతిని 'ఘుణాక్షర న్యాయం' అంటారు.

పరమేష్ఠి మొదట లక్ష్మీదేవిని సుందరంగా సృష్టించాడు. ఇది ఘుణాక్షర న్యాయంగా జరిగిందేకాని, చతుర్ముఖునికి ఇంత అందకత్తెను సృజించే కళా చాతుర్యం ఎక్కడిది? అని లోకంలో ఒక అపవాదం పుట్టింది. తర్వాత బ్రహ్మ ద్వారకలో లావణ్యంలో లక్ష్మితో సమానలైన సువాసినుల సృష్టించి, అంత వరకు తనకున్న అపకీర్తిని తొలగించుకున్నాడు.

ద్వారకలో ఉన్న రమణులందరూ రూపంలో రమాదేవితో సమానమైన వాళ్ళే అనడం అతిశయోక్తి.

బ్రహ్మకు అపకీర్తి కలిగించనడానికి ప్రమాణం ఈ దేవీస్తుతి శ్లోకం :

''ఘుణాక్షరస్యేవ విధానమత్ర
త్వం నిర్మితాదేవి తథా విధాత్రా,
విధేస్తుజానామి సుకౌశలత్వం
త్వద్రూపకల్పా యది దృశ్యతేఽన్యా."

''ఓ దేవీ! బ్రహ్మ, వజ్రకీటం తొలిచిన అక్షరంలా, నిన్ను నిర్మించాడు. అంతే. నీ రూపాన్ని పోలిన మరొక అంగన కనబడితే కదా 'బ్రహ్మ కళా కుశలుడు' అనుకోవడం" అని అర్థం.

22. ఫలద్భి రుష్ణాంశుకరాభిమర్శా
త్కార్శానవం ధామ పతంగకాంతైః,
శశంసయః పాత్ర గుణాద్గుణానాం
సంక్రాంతి మాక్రాంత గుణాతిరేకామ్. (4-16)

శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థానికి ప్రయాణమైపోతున్న సందర్భంలో కవి చేసిన రైవతకాద్రి వర్ణనమిది :

"రైవతక పర్వతం మీద అంతట సోకినట్లే సూర్య కిరణాలు సోకుతున్నాయి. సూర్యకాంత శిలలు ఉజ్జ్వలంగా ప్రకాశిస్తూ సూర్యుని కిరణాల సామర్థ్యాన్ని వ్యక్తపరుస్తున్నాయి. ఆధార వస్తువుల గుణ సహకారం వల్ల సూర్యుని గుణాలకు ఉత్కర్ష కలుగుతుందని ఈ పర్వతం చెప్తుతుంది."

సూర్యుడు అగ్నిగోళం. అది ఎలా తెలియడం? ఆ శక్తి అందరికి తెలియడానికి సూర్యకాంత మణులే ఆధారం. సూర్యకాంత శిలలు రైవతకాద్రిమీద చాలా ఉన్నాయి.

మండుటెండలు అంతట నిండినా, సూర్యకాంత మణుల గుండెలు మాత్రమే అగ్ని గుండాలై, మంటలు గక్కుతూ, దినకర కిరణ తేజో గుణాన్ని ప్రజ్వరిల్ల చేయడానికి తోడ్పడుతున్నాయి.

నిజంగా, సహకార శక్తి లేకుండా, ఒకరి సహజ శక్తి నేరుగా ఉపకరించదు, అనే భావాన్ని నేత్ర పర్వంగా ఉన్న రైవతక పర్వతం ప్రకటిస్తుంది.

***23.*** *దృష్టోఽపి శైల స్సముహుర్మురారే*
*రపూర్వవ ద్విస్మయ మాతతాన,*
*క్షణే క్షణే యన్నవతా ముపైతి*
*తదేవ రూపం రమణీయతాయాః.* ***(4-17)***

ఇది కూడా రైవతక వర్ణనమే.

''ఎన్నిసార్లు చూసినా, రైవతక పర్వతం శ్రీకృష్ణునికి అపూర్వమైన ఆశ్చర్యాన్ని పెంచుతూనే ఉంది. నిజమే. ప్రతిక్షణం కొత్తదనం గోచరింపచేసేదే సౌందర్యం.''

ప్రకృతి సౌందర్యం అభినందనీయం. నిరంతర ప్రకృతి సౌందర్య దిదృక్ష ఆబాలగోపాలాన్ని ఆవేశిస్తుంది. జీవితయాత్ర సాగించేవారికి - భోగులకూ, యోగులకూ రమణీయత ఆనందదాయకం. క్షణం క్షణం నవం నవం, సర్వేంద్రియాలకు సంతర్పణం. ప్రణవాన్నీ, ప్రణయాన్నీ జీర్ణించుకున్న ప్రకృతి అందం కళాసృష్టికి మూలకందం.

రైవతక పర్వతం దివ్యసౌందర్యధామం. కావుననే పరంధాముడైనా పదే పదే చూడడం. మరి ఆశ్చర్యమెందుకు? ప్రకృతికి పరిణామం సహజమని.

''చలం చ గుణవృత్తమ్'' అనే న్యాయంగా ప్రతి క్షణం ప్రకృతి తన చూపు మేర దూరంలో ఉండి నిత్య నూతనంగా మార్పును పొందుతూ ఉంటుంది.

మొదట చూసింది ఎదలో పదిలమై, మళ్ళీ చూస్తే మరోరకంగా కొత్తగా కనబడడమే 'నవత'.

కాలు కదల్చకుండా నిలిచి చూసినా, ''క్షణే క్షణే'' కన్నులరెప్పలు కప్పడం, విప్పడం; కాలవ్యవధి లక్షణం.

చూసింది మళ్ళీ మళ్ళీ చూడాలనిపించేదే సౌందర్యం. సౌందర్య స్వరూపాన్ని నిర్వచించిన ఈ శ్లోకంలోని ఉత్తరార్థం రసజగత్తుకు పరమార్థం. ఆశ్చర్యపడడానికి అందమే హేతువు. కాబట్టి అలంకారం కావ్యలింగం.

''అనేకశస్సంస్తుత మప్యనల్పా, నవం నవం ప్రీతిరహోకరోతి.''

(శిశు. 3-31)

''ఎంతో పరిచయమున్నప్పటికీ, స్నిగ్ధభావం ముగ్ధపరుస్తూ ఉంటుంది'' అనే సూక్తి రమణీయమైన ఈ భావాన్ని మాఘకవి తెలియజేశాడు.

'A thing of beauty is joy forever' అని కదా పాశ్చాత్య మహాకవి సూక్తి - ''సౌందర్యమలంకారః'' అని వామనుడన్నట్లు అర్థాలంకారంతో రమణీయార్థాన్ని ప్రతిపాదించి, సౌందర్యానికి లక్షణవాక్యంగా చెప్పిన ఈ మాఘకవి వాక్యం రమణీయం.

24. *ఉదయతి వితతోర్ధ్వ రశ్మిరజ్జా*
*వహిమకరే హిమధామ్ని యాతిచాస్తమ్.*
***వహతి గిరి రయం విలంబి ఘంటా***
*ద్వయ పరివారిత వారణేంద్రలీలామ్.* **(4-20)**

మాటల నేర్పరి అయిన శ్రీకృష్ణుని సారథి-దారుకుడు, ఆశ్చర్యంతో రైవతకాద్రిని చూస్తున్న శ్రీకృష్ణునితో ఇలా అంటాడు:

''ఒకవైపు ఉదయిస్తున్న సూర్యునితో, మరొకవైపు అస్తమిస్తున్న చంద్రునితో రైవతకాద్రి, రెండువైపుల రెండు గంటలు వ్రేలాడే గజరాజు శోభ వంటి శోభను వహిస్తున్నది.''

మధ్యలో ఉన్నది రైవతక పర్వతం. ఉదయించే సూర్యుడు ఒకవైపు, అస్తమించే చంద్రుడు రెండోవైపు రెండు గంటల్లా ఉన్నారు. పైకి వ్యాపించిన

కిరణాలు త్రాళ్ళలా ఉన్నాయి. కంఠాన వ్రేలాడే రెండు గంటలున్న గజరాజులా, ఈ గిరిరాజు శోభిస్తున్నాడు అని వర్ణించడం చేత కవిబ్రహ్మ అద్రికి ఆయువు పోసి, పఠితకు లోకోత్తరాహ్లాదాన్ని కల్పిస్తున్నాడు.

ఉదయించేది ఉదయాద్రి. అస్తమించేది అస్తాద్రి అని రెండు పర్వతాలను వేర్వేరుగా కవులు వర్ణించడం సహజం. కాని ఇక్కడ ఒకేసారి సూర్యచంద్రుల ఉదయాస్తమానాలు ఒక్క రైవతకాద్రి మీదనే దారుకుడు దర్శించడం విశేషం.

ఉపమాన ధర్మమైన గజరాజశోభ, ఉపమేయమైన గిరిరాజుకు కల్గడం అసంభవం. అయినా, గజరాజశోభవంటి శోభను గిరిరాజు దాల్చాడు అని సాదృశ్యాన్నిబట్టి ఏకత్వం సాధించబడింది. కాబట్టి ఇది నిదర్శనాలంకారం.

సూర్య చంద్రులు పర్వతకుక్షితో సమానమైన కక్ష్యలో సంచరిస్తారనడంతో రైవతకాద్రి మహోన్నత్యం ధ్వనిస్తున్నది. "అహిమ, హిమ-వారి, వార" అని శబ్దాలు ఆవృత్తి అయినందువల్ల వృత్త్యనుప్రాసాలంకారం.

శ్లోక రచనలో కూడా అందం ఉంది. ఒక నాదం ఉంది.

"ఉదయ-అస్తమ్" ఒకేసారి కాబట్టి, శ్లోకపూర్వార్థాన్ని ఇటుచూసి అటు చూడాలి. పూర్వాపర దిక్కుల్లో క్రమంగా పెనగడం, తరుగడం కనబడుతుంది.

శ్లోకంలో "ఊర్ధ్వ రశ్మిరజ్జు" మొదలుకొని దీర్ఘాక్షరాలుండడం విశేషం. ఇవి పొడవైన తాళ్ళు ముడి వేసిన భాగాలుగా అగుపడతాయి.

పూర్వార్ధంలోని 'రే', ఉత్తరార్ధంలోని 'ణే', మెడపైన ఇరువైపులా వ్రేలాడవేసిన పొడవైన తాళ్ళులా అగుపడతాయి. 'లీ' వారణేంద్రుని మెడమీది తాడుమల్కలా భాసిస్తుంది. 'ఘంటా - ద్వయ' శబ్దాలు రెండూ రెండు వరుసల్లో ప్రయోగించి రెండు ఘంటలు రెండు వైపులా ఉన్నాయని స్ఫురింపచేశాడు. ఇక నాదమా? 'ధామ్ని, యంవి, లంబి, ణేంద్ర' లోని గురులఘ్వక్షరాల మధ్యనున్న బిందువులవల్ల ప్రసారమవుతున్నది. శ్లోకంలోని ఆద్యంతాక్షరాలు కలిపితే 'ఉదయలీల' అనే స్పష్టమవుతున్నది. ఉదయకాలంలో వారణేంద్ర లీలవంటి లీల వహించిన 'గిరి' మధ్యలోనే ఉండడం మరో విశేషం.

ఈ శ్లోకంలో భావ సౌందర్యం, రచనా సౌందర్యం, రూప సౌందర్యం, ఈ మూడూ సత్య శివ సుందరంలా సమ్మేళనం చెందినాయి.

ఇది సంస్కృత సాహిత్యంలో ప్రసిద్ధమైన శ్లోకం. కాళిదాసుకు 'దీపశిఖ' అనీ, భారవికి 'కనకాతపత్ర' మనీ పేరు వచ్చినట్లే ఈ శ్లోకం చేత శ్రీ మాఘ కవికి 'ఘంటామాఘుడు' అని పేరు వచ్చింది.

25. యానాజ్జనః పరిజనై రవరోప్యమాణా
రాజ్ఞీర్నరాపనయనాకుల సౌవిదల్లాః,
స్రస్తావకుంఠన పటాః క్షణ లక్ష్యమాణ
వక్త్రశ్రియ స్సభయ కౌతుక మీక్షతే స్మ. (5-17)

శ్రీకృష్ణుడు సపరివారంగా ఇంద్రప్రస్థానికి ప్రయాణమవుతూ త్రోవలో ఒకచోట విడిదిచేసిన సందర్భమిది:

"త్రోవలో సైన్యం స్థావరం ఏర్పరచుకొని శిబిరాలు వేసింది. పల్లకీల్లో నుంచి రాణులను పరిచారికలు క్రిందికి దించుతున్నారు. అప్పుడు కంచుకి మొదలైన సేవకులు ఆ చోటునుంచి పురుషులను తొలగిస్తున్నారు. రాణులు దిగుతుండగానే, తాము ముసుగుగా మీద వేసికొన్న పరదాలను కొద్దిగా పక్కకు నెట్టి, కాసేపు బయట ఇటూ అటూ చూస్తున్నారు. ఆ సమయంలో ఆ ప్రాంతంలో ఉన్న ప్రజలు రాణుల ముఖశోభను భయాశ్చర్యాలతో తిలకిస్తున్నారు."

ఈ శ్లోకంలో ఆనాటి నాగరికత వ్యక్తమవుతున్నది. రాజులు సైన్యంతో పాటు రాణులనూ, దాసదాసీజనాన్నీ వెంటబెట్టుకొనిపోవడం, అంతఃపుర స్త్రీలు మగవారి కంటబడకుండా జాగ్రత్తపడడం, ప్రజలు రాణులను చూస్తుంటే రాజభటులు తమను చూసి శిక్షిస్తారని భయపడడం, అయినా రాణు లెంత అందంగా ఉంటారో - అనే తమకోరిక మరీ రేకెత్తడంతో ప్రజలు రాణుల మొగమే కాదు, వారి నడకా, నాణ్యం, వన్నె, వాసి ఎలాగో పసికట్టక మానేవారు కారనీ తెలుస్తున్నది.

సంపన్నులైన రాణివాస స్త్రీలకు ఘోషా పద్ధతి ఆకాలంలోనే ఆచారంగా ఉన్నట్లు తెలుస్తున్నది.

26. నవ పలాశ పలాశవనం పుర
స్స్ఫుటపరాగ పరాగత పంకజమ్.
మృదులతాంత లతాంత మలోకయ
త్స సురభిం సురభి సుమనోభరైః. (6-2)

రైవతక పర్వత ప్రాంతంలో శ్రీ కృష్ణుడు విహరించే సందర్భంలో కవి చేసిన వసంత ఋతు వర్ణన మిది.

''కొత్త ఆకులు తొడిగిన మోదుగు చెట్లూ, పూసి పుప్పొడి పెల్లుగా ఉప్పతిల్లే తామరలూ, ఎండకు కొద్దిగా వాడిన కోమలపల్లవాలూ, పరిమళించే రకరకాల పూలూ సమృద్ధిగా ఉన్న వసంతర్తువును శ్రీ కృష్ణుడు చూశాడు.''

కష్టాలను కడతేర్చే శ్రీకృష్ణుణ్ణి పత్ర పుష్పఫలాల వంటి తమ తమ లాంఛనాలతో సేవించడానికి ఆరు ఋతువులూ కాల నియమాన్ని కూడా విడిచి, ఒక్కసారే ఆవిర్భవించాయి. సేవించడంలో మాత్రం అవి క్రమాన్నే పాటించాయి. కాబట్టి వసంతానికే ప్రాథమ్యం.

చిగురాకుల కోసం ముదురాకులు రాలిపోగా, మోదుగు మోడులు మోసులెత్తడం స్థలద్రవ్యశోభ. ఇంతకు ముందు మంచు వల్ల కుంచించుకు పోయిన సరోజాలు సంతోషంతో రేకులు విప్పడం జలద్రవ్య శోభ. తేమలేని గాలికి పూలధూళి రేగడం వాయుద్రవ్య శోభ. కోమలమైన లతాంతాలు ఎరు పెక్కడం తేజోద్రవ్యశోభ. దశ దిశల పరిమళం వ్యాపించడం ఆకాశ ద్రవ్య శోభ.

వసంతర్తువు తనకున్న ద్రవ్య బలంతో భోగులను పరవశింపజేయడం సహజం. 'సేవిస్తున్నకొద్దీ ఆనందింప చేసేది వసంతం.' 'వసంత మృతూనాం ప్రీణామి సమాప్రీతః ప్రీణాతు' అన్నది వేదం, హేమన్త శిశిరర్తువులకు లేని ఈ కొత్త ద్రవ్య శోభను కవి 'నవ' శబ్దంతో సూచించాడు.

శ్రీకృష్ణుడు భోగియే కాదు, యోగి కూడా. ''పండితుల ప్రశంసలందుకొని పేరు పొందిన వాడూ, పాపాల వల్ల కలిగే దుఃఖానికి దూరంగా ఉన్నవాడూ, తపోనియమాలచే బక్కచిక్కిన భార్య ఉన్న ఒక వానప్రస్థాశ్రమ సజ్జనుణ్ణి శ్రీకృష్ణుడు చూశాడు'' అని ఈ శ్లోకానికి మరొక అర్థమూ ఉంది. భోగులకు ద్రవ్యబలం, యోగులకు మనోబలం కావాలి. రైవతకాద్రి పరిసర వనంలో విహరిస్తూ శ్రీకృష్ణుడు భోగ దృష్టితో ఋతుశోభను, యోగ దృష్టితో తనను సేవించే సత్పురుషుణ్ణి తిలకించాడు.

'వనం' అంటే అడవి, నివాసం; 'పంకం' అంటే బురద, పాపం; 'సుమనస్' అంటే పూలు, పండితులు; 'సురభి' అంటే పరిమళం, వసంతం, సజ్జనుడు అని శబ్దాలకు నానార్థాలున్నాయి.

ప్రతిపాదంలో రెండక్షరాల తర్వాత ఉన్న మూడక్షరాలు ఇలా-పలాశ-పలాశ; పరాగ-పరాగ; లతాంత-లతాంత; రభింసు-రభింసు, లేక సురభిం-సురభిం; అని ఆవృత్తి అయినాయి.

ఈ శ్లోకంలో యమకం చక్కని గమకాన్ని సాధించింది. పదలాలిత్యం చెవులకు చవులందించింది,

**27.** సమయ ఏవ కరోతి బలాబలం
ప్రణిగదన్త ఇతీవ శరీరిణామ్.
శరది హంసరవాః పరుషీకృత
స్వరమయూర మయూరమణీయతామ్. *(6-44)*

ఇది శరదృతు వర్ణనం.

"సమయమే శరీరధారుల బలాబలాలను నిర్ధారణ చేస్తున్నదో అన్నట్లు కులుకుతున్నాయి శరత్కాలంలో హంసలు. అవి నెమిళ్ళ క్రేంకార ధ్వనులను కర్కశం చేసి మాధుర్యాన్ని సంతరించుకున్నాయి."

వర్ష ఋతువులో మయూర కంఠస్వరాలు మధురంగానూ, హంస ధ్వనులు కర్ణకఠోరంగానూ ఉండేవి శరదృతువులో మయూర ధ్వనులు చెవులకు ములుకులై, హంసల కులుకులు చవులూరిస్తున్నాయి. ఈ మార్పు కాల ప్రభావంవల్లనే ఏర్పడ్డది.

ప్రాణులను బలవంతులుగానూ, దుర్బలులుగానూ చేయడానికి కాలమే కారణం; వేరే కారణం అగుపడదు అని ఉపదేశిస్తున్నాయి హంసలు.

హంసలు, నెమిళ్ళు పరస్పరంగా మధురమైన స్వర సంపదను మార్చుకున్నాయి. కాబట్టి, శరదృతువులో రాయంచల కులుకులు రమణీయంగా ఉన్నాయి అని వర్ణించడం ఉత్ప్రేక్ష. నాల్గవ చరణంలోని యమకం రమణీయం.

ఇదే ఋతువును భారవి కూడా—

"విహాయ వాంఛాముదితే మదాత్యయా
దరక్త కంఠస్య రుతే శిఖండినః,
శ్రుతిశ్శ్రియత్యున్మద హంస నిస్వనం
గుణాః ప్రియత్వేఽధికృతా న సంస్తవః." (కిరా-4-25)

"(ప్రాణుల) చెవులు మదం తగ్గిన మయూరాల కంఠస్వరంపై విరక్తి చెంది, మదించిన హంసల స్వరాన్ని ఆశ్రయించాయి. ప్రీతిని కలిగించే అధికారం గుణానికే ఉంది కాని పరిచయానికి లేదుకదా!" అని వర్ణించాడు.

"అక్షరా ద్దీప్తి రుచ్యతే" అని శ్రుతి పలికినట్లు మాఘ కవి అక్షరాల వివక్ష ఇలా ఉంది.

హకారం నుంచి సకారం వరకు సున్న చుట్టినట్లు వర్ణమాలను త్రిప్పి జపిస్తే 'హంస' సాక్షాత్కరిస్తుంది.

హంస ముఖాన కులికేవి, ' అ ఇ ఉణ్, ఋ ఌక్' - స్వరాలు, అంటే అచ్చులు. అచ్చులు అతికితే హల్లుల బ్రతుకు రమణీయం.

'కచట తప' లనేవి పరుషాక్షరాలు. మయూర ధ్వనిని 'కేక' అంటారు. 'కేక'కు స్వరాల ఊత లేకపోతే దాని బ్రతుకు 'రవ రవ.' మయూర ధ్వని, శరత్తు కాబట్టి, కేవలం స్వర మాధుర్యంలేని 'క్క్' పరుషీకృతమే.

హంసకు కవి అని కూడా అర్థం. 'సమయ' శబ్దానికి సంకేతమూ, జ్ఞానమూ అనే అర్థాలున్నాయి. శ్లోకంలోని ఆద్యంతాక్షరాలు కలిస్తే 'సతాం' అవుతుంది. 'సతాం' అంటే 'సత్పురుషులకు' అని అర్థం.

శాస్త్రజ్ఞానం బహుక్లేశం కాబట్టి అది అభ్యర్థిని విజ్ఞునిగానో, అజ్ఞునిగానో మార్చవచ్చు. శాస్త్రాభ్యాస ఫలం కళ. కళకు ప్రయోజనం ఆనందం. కళలో ఉండేది ఒక్క అమృతమే. కాబట్టి సత్కవుల వాక్కు ఉపదేశాత్మకమనీ, అది కళాత్మకంగానూ ఉండడం రమణీయమనీ, లోకులు దాన్ని ఆదరించడం, ఆదరించకపోవడం కాలమే నిర్ణయిస్తుందని ధ్వని.

**28.** *విరత సస్య జిఘత్స మఘట్టయ*
*త్కలమ గోప వధూర్న మృగవ్రజమ్,*
*శ్రుత తదీరిత కోమల గీతక*
*ధ్వని మిషేఽనిమిషేక్షణ మగ్రతః.* **(6-49)**

ఇది కూడా శరదృతు వర్ణనమే.

"అది ఆశ్వయుజ మాసం. ఒక కాపు పడుచు పంటచేలను కాపలా కాస్తున్నది. లేళ్ళూ, జింకలూ, దుప్పులూ చేలలో దూరి వరి మేయడానికి వచ్చినాయి. అప్పటికే ఆ పడుచు ఒక కమ్మని పాట పాడడం మొదలుపెట్టింది. వచ్చిన మృగాలు చేలను మేయక, కాలు కదల్చక, మోరలెత్తి, రెప్పవాల్చక పాటకు చెవులప్పగించాయి. ఒక్క పోచకూడా ముట్టకుండా చూచే మృగాలను బడితతో కొట్టి తరిమివేసే అక్కరలేకపోయింది ఆ పడుచుకు."

పంట చేతికందే కాలం శరత్కాలం. 'గోప వధువు' అంటే పంటపొలం పాడుకాకుండా కాపాడుకునే యువతి. ఉన్నది ఒకర్తె. మరి మృగాలేమో ఒక్కటికాదు, రెండుకాదు. మందకు మందనే 'మృగవ్రజం'వచ్చింది. పొలంలో ఒక మూల మేస్తున్న మృగాలను తరిమివేస్తుంటే, కొన్ని మరొక మూలలో

దూరి వరి మేయవచ్చు కదా! నాలుగు మూలల్లో దూరే మృగాలను కొట్టి తరిమి వేయడం కష్టం. శిశువులూ, పశువులూ, పాములూ గానరసాన్ని చూరగొని పరవశించడం ప్రతిదినం చూసిందే ఆ పడుచుపిల్ల. అందువల్ల తన కమనీయ గాన మాధుర్యంతో కడుపుమంట చల్లారి, మృగాలకు ఆనందం హెచ్చింది.

వరి మేయకుండా చేసే పనికి మృగాలను కొట్టి తరిమివేయడమే కారణం. కాని కాకతాళీయంగా, కమ్మని పాట పాడడమనే మరొక కారణం సహకరించడంతోనే ఆ పని ఫలించింది. మృగాలు గానసుఖంచేత సమాధిస్థాయిని పొందిన ఈ సన్నివేశాన్ని, సమాధ్యలంకారాన్ని ప్రయోగించి, కవి అలంకారౌచిత్యాన్ని పాటించాడు.

ఆశ్వయుజ మాసంలో పల్లెటూళ్ళ పడుచులు, ఇంటా-బయటా జానపద గీతాల్లో, ఉయ్యాల పాటలో పాడుకోవడం సహజమనీ, నొప్పింపక తానొవ్వక పనులు హాయిగా నెరవేర్చుకుంటారనీ, మృగాలనైనా మృదువుగా వశపరచుకునే మహిమ జానపద గేయానికి ఉందని ధ్వని.

మాఘకవి భావానికి ఆలంబనం భారవి రచించిన ఈ క్రింది శ్లోకం:

''కృతావధానంజితబర్హిణ ధ్వనౌ
సురక్త గోపీజనగీత నిస్వనే
ఇదం జిఘత్సామపహాయ భూయసీం
న సస్యమభ్యేతి మృగీకదంబకమ్,'' (కిరా. 4-33)

'కాపుపడుచులు షడ్జ స్వరాలాపన చేసి పాడిన పాటను విన్న ఆడలేళ్ళ గుంపు ఆకలి మరచి పైరు మేయలేదు'

మాఘకవి భారవిని అనుకరించినా, రచనలో ప్రౌఢిమనూ ప్రదర్శించాడు, చక్కని లయనూ సాధించాడు.

*29.* *అవచిత కుసుమా విహాయ వల్లీ*
*ర్యువతిషు కోమల మాల్యమాలినీషు,*
*పదముపదధిరే కులాన్యళీనాం*
*న పరిచయో మలినాత్మనాం ప్రధానమ్.* *(7-61)*

వన విహార వర్ణనమిది.

''తుమ్మెదలు పూలుగోసిన తీగ చెట్లను వదలి, పూలమాలలను ధరించిన యువతులను చేరుకున్నాయి. మలినాత్ములకు పరిచయం ప్రధానం కాదుకదా!''

మొదలే పడుచుతనం పొడసూపక వచ్చిన కోమలాంగులు. పైగా ఆ యువతులు పూలుగోసి మాలలల్లి అలంకరించుకున్నారు. పూలులేక, శోభతరిగి వట్టి తీగలే మిగిలిఉన్నాయి వనంలో. తుమ్మెదలకు పూదీగలతో చిరకాలం నుంచి సహవాసమూ, ఆత్మీయతా ఉండేది. ఉంటే ఏం లాభం? కమ్మని పూలు లేక పోవడంవల్ల చెన్ను తరిగిన వల్లికామతల్లికలను తుమ్మెదలు విడిచిపెట్టి పోయినాయి. ఎక్కడికి? అప్పుడే వికసించిన విరులసరాలతో పరిమళించే పడతుల దగ్గరికి. ఎందుకు? సువాసినీ వాసనల భోగం అనుభవించేందుకు. నిజమే కదా! మలినాత్ములకు పరిచయం ముఖ్యంకాదు.

'మలినాత్ములు' అంటే నల్లని దేహంగల తుమ్మెదలు అనే అర్థమేకాక దుష్టస్వభావం గల వ్యక్తులు అని కూడా అర్థం. చిరకాలం సహవాసం చేసినా, సిరిసందఘులేని రిక్తహస్తులదరిజేరరు మలినాత్ములు. వారికి కావలసింది పరిచయం కాదు, ప్రసాదం. రక్తికాదు, భుక్తి. స్నేహంకాదు, మోహం.

పరార్థానికి ప్రాకులాడక, స్వార్థమే పరమార్థమని భావించి, Floor crossing చేసే వారందరు ఈ కోవకు చెందినవారే కదా ! పరిచయమున్నా, లేకున్నా పచ్చపచ్చగా ఉన్నచోట భోగాసక్తితో పాదం మోపడమే మలినాత్ముల స్వభావం.

మలినాత్ములనడంవల్ల శ్లేషాలంకారం. తుమ్మెదలకూ, దుష్టచిత్తులకూ భేదమున్నా అభేదం కల్పించడం అతిశయోక్త్యలంకారం. మొదట చెప్పిన మాటను తర్వాత చెప్పినమాటతో సమర్థించడం అర్థాంతరన్యాసాలంకారం.

ఇలా ఈ శ్లోకమూర్తి ముచ్చటగా మూడు అలంకారాలతో శోభిస్తున్నది.

*30.* *ఆర్ద్రత్వా దతిశయినీ ముపేయివద్భి*
*స్పంసక్తిం భృశమపి భూరిశోఽపభూత్తైః,*
*అంగేభ్యః కథమపి వామలోచనానాం*
*విశ్లేషోఽజత నవరక్తకైః ప్రవేదే.* *(8-67)*

జలక్రీడలాడిన జలజాక్షులు గట్టెక్కి బట్టలు మార్చుకునే దృశ్యం ఇది.

''నీళ్ళలో తడిసి ఒంటికి అంటుకొనిపోయిన కొత్త ఎర్రని వస్త్రాలు పెక్కుసార్లు విడుస్తూ ప్రక్కకునెట్టినా, అవి వామలోచనల శరీరం నుంచి వీడలేక వీడలేక అతికష్టంగా విడిపోయినాయి.''

ఒంటికి పూసుకున్న కుంకుమ, చందనం మొదలైన సుగంధరాగ ద్రవ్యాలు నీటిలో కరిగిపోయినందువల్ల వలువలు ఎర్రగా మారినాయి. జల

క్రీడలో తడిసినాయి కాబట్టి ఒంటికి అంటుకుపోయి తొందరగా విడిపోక అతి ప్రయత్నంతో పరిహరింపబడినాయి. దుస్తులు మారుస్తున్నప్పుడు తమను ఎవరైనా చూస్తారేమో అన్న వివేచనతో నాలుగు దిక్కులా దృక్కులను ప్రసారం చేయడం వామలోచనల స్వభావం.

స్త్రీలైనా నగ్నంగా స్నానం చేయరాదు. 'సవాసా జలమా విశేత్' అని ధర్మశాస్త్రం. శ్లోకంలో- ''ఆర్ద్రిత్వం, సంసక్తిం''- అనే మాటల్లోని సంయుక్తాక్షరాల ప్రయోగం ఒంటికి తడిబట్టలంటుకున్న రీతిని సూచిస్తుంది. 'నవరక్త' శబ్దంవల్ల కొత్త ఎర్రని వస్త్రాలనీ, నూత్న ప్రేమానురక్తులనీ అర్థద్వయం సిద్ధిస్తుంది.

'బత ! విశ్లేషః' – అయ్యో ! శ్లేషకాదు, విశ్లేష. చరమార్థం ఎడబాటే అనీ, అదికూడా చివరికి పాదప్రయోగంతోనే అని చమత్కరించాడు కవి.

"సరసమైన ప్రేమ కలవారు కాబట్టి అత్యాసక్తులైనందువల్ల ఎన్నిసార్లు తిరస్కరించి బయటకు నెట్టినా, అపూర్వమైన అనురాగం గల పురుషులు విడువలేక విడువలేక వెలదుల శరీరాలను విడిచి వేరైపోయినారు" అని మరొక అర్థం ద్యోతకమవుతుంది. నవరక్తులు సుశ్లోకులే. వారికి పాద ప్రయోగం నాల్గవది. కాబట్టి ఆ శ్లేష ఉపేయం కాదు. ఈ విధంగా ఈ శ్లోకం శబ్దశక్తి మూలక ధ్వనిని గర్భీకరించుకున్నది.

అలంకారాల సౌభాగ్యాన్ని శ్లేష పోషిస్తుంది. నిజమే. కాని 'ఆర్ద్రిత్వం, సంసక్తిం' అనే విశేషణాలతో పాటు 'నవరక్తకైః' అనే విశేష్యం కూడా శ్లేషించింది.

రెండర్థాలూ ప్రకృతాలైతే శ్లేషాలంకారం. శబ్దంలో వాచ్యార్థం విన్న తర్వాత, అప్రకృతంగా మరొక అర్థం తోచినప్పుడు అది శబ్దశక్తి మూలక ధ్వని అవుతుంది.

**31.** *ఉపజీవతిస్మ సతతం దధతః*
*పరిముగ్ధతాం వణిగివోడుపతేః,*
*ఘన వీథివీథి మవతీర్ణవతో*
*నిధి రంభసా ముపచయాయ కళాః,*

చంద్రోదయ వర్ణన మిది.

''అందంగా ఆకాశంలో ఉదయించిన చంద్రుని కళలను తన జలవృద్ధి కోసం సముద్రుడు, అంగడిబజారులోకి వచ్చిన మూఢుడైన ఒక వ్యాపారస్తుని

విలువైన వస్తువులనన్నీ తన ధనవృద్ధి కోసం తెలివిగల వర్తకునిలా గ్రహించాడు.''

సముద్ర బలానికి పోటూ పాటూ ఉండడం ప్రకృతి సిద్ధం. చంద్రుడు కళానిధి. అమృతాంశుడు. అమృతం అంటే నీరు. చంద్రుడు కనబడగానే సముద్రం పొంగిపోతున్నట్లు చెప్పడం కవి సంప్రదాయం.

''మహోదధేః పూర ఇవేందు దర్శనాత్.'' (రఘు. 3-17)

సౌందర్యం, మూఢత్వం అని రెండర్థాలున్న పదం 'ముగ్ధత.' 'కళ' అంటే చంద్రునికాంతితో 1/16 వ భాగం; మూలధనవృద్ధి అని మరో అర్థం.

పడవలపై తెచ్చిన సరుకులను వ్యాపారస్థులు నగర వీథుల్లో, పెట్టుబడిపై లాభం వచ్చే ధరకు వర్తకులకు అమ్మడం ప్రసిద్ధం. సముద్రుడు నేర్పుగల నగర వర్తకుని లాంటివాడు. గగనం నగరవీథి వంటిది. నౌకా వ్యాపారి వర్తక వ్యవహారాలేమీ తెలియనివాడు. అందుకే 'ఉడుపతి' శబ్దం సాభిప్రాయం.

సరుకుల నమ్మిన ఓడ బేరగానికి లాభమేమి లేకుండా, పట్టణ వర్తకుడు అతని సరుకులను కొన్నాడు.

మాఘకవి ఇలా వర్ణించడం యాదృచ్ఛికం అనుకోవడానికి వీల్లేదు. ఆర్థిక, సామాజిక రంగాల్లో, వర్తకం తీరుతెన్నులు తెలిసినవాళ్ళు సాటి బేరగాని అసమర్థతను ఆసరా చేసుకొని, వస్తువుల విలువనూ, రవాణాఖర్చులనూ విచక్షణ చేయక నయవంచకులై చౌకగా కొని, స్వార్థంతో లాభాలార్జించడం నేడేకాదు ఆ నాడు కూడా ఉన్నదనే నిప్పులాంటి నిజాన్ని శ్లేషించి చెప్పివేశాడు.

ముగ్ధుడు ఆఘ మేఘాలమీద వీథీ వీథీ తిరిగితే ఉత్తీర్ణుడు కాక అపతీర్ణుడవుతాడు కాబోలు.

ఈ శ్లోకంలోని ఉపమాలంకారం శ్లేషతో సంకీర్ణమై సహృదయ గమ్యంగాఉంది.

**32.** *సంతమేవ చిరమప్రకృతత్వా*
*దప్రకాశిత మదిద్యుతదంగే,*
*విభ్రమం మధుమదః ప్రమదానాం*
*ధాతులీన ముపసర్గ ఇవార్థమ్.* **(10-15)**

మద్యపాన వర్ణనమిది.

''మద్యం సేవించనందువల్ల ఇప్పటిదాకా మగువల్లో వెల్లడి కాకుండా ఉన్న దేహవిలాసాన్ని, ప్రస్తుతం మద్యపానంవల్ల కలిగిన మత్తు, ధాతువులో ఉన్న అర్థాన్ని ఉపసర్గవలె ప్రకాశింపజేసింది.''

ఈ శ్లోకంలోని ఉపమానం వ్యాకరణశాస్త్రానికి సంబంధించింది. "ఫల వ్యాపారయోర్ధాతుః" అనే న్యాయంచేత ఫలాన్నీ వ్యాపారాన్నీ బోధించేది ధాతువు.

'ఉపసర్గాః క్రియా యోగే', 'తే ప్రాగ్ధాతోః' అనే సూత్రాల ననుసరించి ప్ర, పరా మొదలైన ఇరవై యొక్క ఉపసర్గలు క్రియాపదాలకు ముందే చేర్చి వాడబడుతాయి.

"ఉపసర్గేణ ధాత్వర్థోబలాదాన్యత్ర నీయతే" అనే న్యాయంచేత సహజంగా ధాతువుకున్న అర్థం ఉపసర్గ బలంతో రకరకాలుగా మారుతుంది. 'భూ' ధాతువుకు ఉండుట, అగుట అనే అర్థం సహజం. ఈ ధాతువుకు ముందు ఉప సర్గలు చేరితే ప్రభవతి, పరాభవతి, పరిభవతి, ఉద్భవతి, అనుభవతి. ఇలా అనేకంగా అర్థాలు మారడం విశేషం.

'ధాత్వర్థం బాధతే కశ్చిత్ కశ్చిత్తమనువర్తతే,

తమేవ విశినష్ట్యన్య ఉపసర్గ గతి స్త్రిధా' అని ఉపసర్గల ప్రవృత్తి మూడు రకాలు.

1. ఒకచోట ఉపసర్గ ధాత్వర్థాన్ని బాధించి, మరొక అర్థాన్ని బోధిస్తుంది. ఉదాహరణకు 'స్థా' ధాతువు క్రియాపదంగా 'తిష్ఠతి' అవుతుంది. నిలబడుతున్నాడని అర్థం. దీనికి 'ప్ర' చేరగా 'ప్రతిష్ఠతే' అవుతుంది. బయల్దేరుతున్నాడని అర్థం. ఇలాగే 'ముంచతి' అంటే విడుస్తున్నది. 'ఆ 'ముంచతి' అంటే ధరిస్తున్నది అని అర్థం.

2. ఒకచోట ఉపసర్గ చేరినా అర్థం మారదు. 'విశతి' అన్నా 'ప్రవిశతి' అన్నా ప్రవేశిస్తున్నాడనే అర్థం.

3. కొన్ని చోట్ల ఉపసర్గ అర్థ విశేషాన్ని బోధిస్తుంది. హసతి, ప్రహ సతి, పరిహసతి, అపహసతి, ఇలా ఇవన్నీ నవ్వులోని విశేషాలే కదా!

ఇలాగే ఈ శ్లోకంలోని 'ప్రమద, విభ్రమ' శబ్దాల ప్రయోగం సాభిప్రా యంగా సాగిందే.

శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థానికి పోతుండగా త్రోవలో యాదవులందరూ - స్త్రీలూ, పురుషులూ మద్యపానం చేశారు. మగువల శరీరంలో సహజంగా విలాసం జిగిబిగిగా ఉండనే ఉంటుంది. మద్యం త్రాగడంవల్ల మత్తెక్కి బిగి తగ్గి, జిగి పెరుగుతుంది. అందుచేత ఇంతకుముందే ఉన్న విలాసం విశేషంగా అంటే-

కటాక్ష, హాస, పరిహాసాలూ; చతురమైన ఆలాప, ప్రలాప, సల్లాపాలూ ప్రకటితమవుతాయి.

ఉపసర్గధాత్వర్థాలను ప్రకటించినట్లే మధుపానమదం ప్రమదల విలాస విభ్రమాలను వెల్లడి చేసింది అని భావం.

కాళిదాసు కూడా శబ్దశాస్త్ర విషయాన్ని ధారాళంగా ఉపమా సామగ్రిగా గ్రహించాడు.

'ధాతోః స్థాన ఇవాదేశం సుగ్రీవం సంన్యవేశయత్' (రఘు. 12-56)

'పశ్చాదధ్యయనార్థస్య ధాతోరధిరివాభవత్' (రఘు. 15-9)

గౌడి, మాధ్వి, పైష్టి అని సుర మూడు రకాలు. బెల్లం నుంచిగానీ, ఈత, తాటి లాంటి చెట్లనుంచిగానీ సిద్ధంచేసే కల్లు 'గౌడి'. ఇప్పపూల నుంచి తయారుచేసే మద్యం 'మాధ్వి'. ద్రాక్షాది ఫలాలనుంచి తయారుచేసే సారాయి 'పైష్టి'.యాదవులు పానం చేసింది మాధ్వి అని కవి హృదయం.

33. *అసకృద్గృహీత బహుదేహ సంభవ*
*స్తదసౌ విభక్త నవగోపురాన్తరమ్,*
*పురుషః పురం ప్రవిశతి స్మ పంచభి*
*స్సమ మింద్రియైరివ నరేంద్రసూనుభిః.* **(13-28)**

శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థ నగరంలో ప్రవేశించే సందర్భంలోని వర్ణనమిది.

''అనేక జన్మ లెత్తిన పురుషుడు తన పంచేంద్రియాలతో కలిసి, వేర్వేరుగా నవగోపురాలతో భాసించే శరీరంలో ప్రవేశించినట్లే శ్రీకృష్ణుడు పంచ పాండవులతో కలిసి ఇంద్ర ప్రస్థపురంలో ప్రవేశించాడు.''

'పురుషుడు' అంటే జీవుడూ, శ్రీకృష్ణుడూ అని రెండర్థాలు. 'పురం' అంటే శరీరం. నగరం అని మరో అర్థం. 'నవగోపురాలు' అంటే తొమ్మిది ద్వారాలు. శరీరంలోని మల, మూత్ర, నేత్ర, కర్ణ, నాసికా, ముఖ, ద్వారాలు- 'నవ' శబ్దం వల్ల కొత్త ద్వారాలు అని కూడా అర్థం.

ఎన్నోసార్లు ఎన్నో దేహాల్లో పుట్టే జీవుడు తొమ్మిది ద్వారాల నూతన శరీరంలో వాసనా రూపంలో ఉన్న తన పంచేంద్రియాలతోపాటు ప్రవేశిస్తాడు. ఇందుకు భగవద్గీతలోని—

''శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః,
గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధానివాశయాత్'' (15-8)

అనే శ్లోకం ప్రమాణం.

"యథా వృక్షస్య సంపుష్పితస్య దూరాద్గంధో వాతి'' అని శ్రుతి. 'పూచిన చెట్టు నుంచి వాయువు గంధాణువులను తీసుకొని పోయేరీతిగా, జీవుడు వాసనాయుక్తమైన ఇంద్రియాలనే వెంటబెట్టుకొని నూతన శరీరంలో ప్రవేశిస్తా'డని భావం.

పురాణ పురుషుడు శ్రీకృష్ణుడు కూడా శిష్ట రక్షణ కోసం, దుష్ట శిక్షణ కోసం మత్స్య, కూర్మ, వరాహ, నరసింహ, వామన, భార్గవరామ, శ్రీ రామ చంద్రాద్యనేక జన్మలెత్తి బహు దేహధారి అయ్యాడు.

ద్వారక నుంచి బయల్దేరింది మొదలు రేయింబవళ్ళు ప్రయాణ వార్తను తెలుసుకుంటున్న పాండవులు, శ్రీకృష్ణుడు యమునానదిని దాటి రాగానే అతణ్ణి మంగళ వాద్యాలతో ఎదుర్కొన్నారు. అతడు వారితో పురంలో ప్రవేశించాడు.

మహాకవి మాఘుని ఈ శ్లోక పుష్పం మొదట శ్లేష పరిమళాలనూ, తర్వాత ఉపమా మరందాన్నీ ప్రసరిస్తూ సహృదయులను అలరిస్తున్నది. ఇక 'కర్మ ప్రారబ్ధ' మవుతుందని అలంకారధ్వని.

*34* *సంభృతోపకరణేన నిర్మలాం*
*కర్తు మిష్టి మభివాంఛతా మయా*
*త్వం సమీరణ ఇవ ప్రతీక్షితః*
*కర్షకేణ వలజాన్ పుపూషతా.* *(14-7)*

శ్రీకృష్ణుణ్ణి ఎదుర్కొని మయ సభకు తీసుకొని వచ్చి మర్యాద చేసిన ధర్మరాజు, యాగం చేయడానికి తనకు అనుమతిని ప్రసాదించుమని శ్రీకృష్ణుణ్ణి ఇలా ప్రార్థిస్తాడు.

"పవిత్రమైన యాగం చేత తలచాను కాబట్టి సకల సాధన సామగ్రిని ఒక్కచోట సమకూర్చి ధాన్యరాశిని శుభ్రం చేయడానికి రైతు గాలికోసం ఎదురు చూసే రీతిగా నీకోసం నేను ప్రతీక్షిస్తున్నాను."

సమస్త పదార్థాలు సిద్ధంగా ఉన్నాయి. దోషం లేశమైనా లేకుండా యజ్ఞం చేయాలని ధర్మరాజు సంకల్పం. ప్రాణ రక్షణకు ఉపయోగపడే ఆహార ధాన్యాన్ని శుద్ధిచేసే శక్తి జగత్ప్రాణునికి అంటే గాలికే ఉంది. కాబట్టి కర్షకుడు ధాన్యాన్ని శుద్ధిచేసే గాలికోసం ప్రతీక్షిస్తాడు.

ఒక వ్యక్తి పనిచేస్తున్న రీతిని చూడడం నిరీక్షణ. పనిచేసే వ్యక్తికోసం ఇంకా రాలేదేమని ఎదురు చూడడం ప్రతీక్షణ.

గాలి అంతట నిండి ఉన్నదే అయినా, పడ్లకుప్ప నెగబోయదగిన రూపంలో వీచకపోతే కర్షకుని పని అంతా దుష్ప్రయోజకమవుతుంది. ఇందు మూలంగా మంచి ఫలం లభించకపోవడమే గాక ధాన్యరాశి కూడా కొక్కు పురుగు పట్టీ, ముక్కపట్టీ చెడిపోతుంది. కర్షకుని లాంటి ధర్మరాజు సకల ద్రవ్యరాశిని సమకూర్చుకున్నప్పటికి జగత్ప్రాణుని లాంటి శ్రీకృష్ణుడు రాకుంటే అతని యాగం దుష్కరమవుతుంది.

ఈ శ్లోకంలోని 'సమీరణ' శబ్దం వేదార్థాన్ని సూచిస్తుంది. "యమేరిరే భృగవో విశ్వ వేదసం, నాభా పృథివ్యా భువనస్య యజ్మనా." "అహమేవ వాతఇవ ప్రవా మ్యారభమాణా భువనాని విశ్వా." "సర్వగ్ం సపూతమశ్నాతి స్వదితం మాతరిశ్వనా." "అమృతం దేవానా మాయుః ప్రజానామ్."

'మాతరిశ్వుడు అంతరిక్షం నుంచి అగ్నిని భూలోకానికి తెచ్చి భృగు వంశీయుల కీయగా వారు వైదిక సూక్తులతో అగ్నిని ప్రతిష్ఠించి వృద్ధి చేశా' రన్నది ఋగ్వేదం. 'విశ్వమంతట వాయువులా వీచేవాడను నేనే' అనీ, 'వాయువు శుద్ధి చేసిన ద్రవ్యమే హవ్యంగా వాడబడుతుం'దనీ, ఈ హవిస్సే అమరులకు ఆహారమవుతుంది, ఉర్వి ప్రజలకు ఊపిరి అవుతుంది' అని వేద పురుషుని మాట.

'యజ్ఞో వై విష్ణుః' అనే శ్రుతి ప్రకారం యజ్ఞ పురుషుడూ, యజ్ఞ సంరక్షకుడూ శ్రీకృష్ణుడే. అందుకే మాఘుడు ధర్మరాజుతో ఇంకా ఇలా అనిపిస్తాడు.

''స్వాపతేయమధిగమ్య ధర్మతః పర్యపాలయ మహీభృధం చ యత్,
తీర్థగామికరవై విభానత స్తజ్జుషస్వ జుహవానిచానలే.'' (14-9)

స్వపతికి అంటే స్వామికి అర్పించే ద్రవ్యం 'స్వాపతేయం.' అగ్నిముఖాన వ్రేల్చే స్వాపతేయాన్ని స్వీకరించే యజ్ఞభోక్తకూడా శ్రీకృష్ణుడే.?

నిర్దోషంగా జరిగే యజ్ఞానికి ఉపయోగించే చరు, పురోడాశాది హవ్య ద్రవ్యరాశిని శుద్ధిచేసే సామర్థ్యం యజ్ఞ పురుషునికే ఉండడంవల్ల శ్రీకృష్ణుని కోసం ధర్మరాజు ప్రతీక్షించాడు.

శ్లోకంలో ఈ అర్థ చమత్కారమంతా 'కర్మణి ప్రయోగం' వల్ల అనుభవించడం విశేషం.

''త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః, పాదోఽస్యేహాభవత్పునః'' అని పురుష సూక్తమన్నట్లు శ్లోకరచన సాగింది. మొదటి మూడు పాదాలు కారక క్రియతో

పూర్తి అయినప్పటికీ లోకలీలను విలసింపచేసే నాల్గవ పాదంతోనే రచన పరిపూర్ణంగా భాసిస్తున్నది.

కాబట్టి ఈ శ్లోక రచనలో Dynamic beauty ఉంది.

**35** *సప్త భేదకర కల్పిత స్వరం*
*సామ సామవిద సంగ ముజ్జగౌ,*
*తత్ర సూనృతగిరశ్చ సూరయః*
*పుణ్య మృగ్యజుష మధ్యగీషత* **(14-21)**

యాగ విధానాన్నిగూర్చి చెప్పే శ్లోక మిది.

"సామ వేదవేత్త అయిన ఉద్గాత స్వరయుక్తంగా చేతుల నూపుతూ స్ఖాలిత్యం లేకుండా గానం చేస్తున్నాడు. ప్రియ సత్యవాదులైన వేద పండితులు శ్రేయోదాయకాలైన ఋగ్యజుర్వేదాలను అధ్యయనం చేస్తున్నారు."

యజ్ఞంలో దేవతలను ఆహ్వానించి ఆయా దేవతల నుద్దేశించి నేయి, పెరుగు, తేనె, చదువు ఇంకా మొదలైన హోమ ద్రవ్యాలతో వేద మంత్రాలను పఠిస్తూ హోమకుండాగ్నిలో హవనం చేస్తున్నారు ఋత్విక్కులు. ఈ విషయాన్నే 'తాం దేవీంవాచగ్ంహవిషాయజామహే' అని వివరిస్తుంది వేదం.

నిషాదం, ఋషభం, గాంధారం, షడ్జం, మధ్యమం, ధైవతం, పంచమం అనేవి సప్తస్వరాలు. 'ప్రాణ ఉద్గాతా' అని శ్రుతి పలికినట్లు యజ్ఞానికి ప్రాణం ఉద్గాత. వేద పఠనంలో స్వరంగానీ, వర్ణంగానీ తప్పినట్లైతే అర్థం మారిపోయి దుష్ఫలితాన్నిస్తుంది. అందుకే కరచాలనం చేస్తూ స్వరాలకూ, మాత్రలకూ, వర్ణాలకూ స్ఖాలిత్యం లేకుండా బృహద్రథంతరాది సామవేద మంత్రాలను గానం చేసే ఋత్విక్కును 'ఉద్గాత' అంటారు.

"ప్రయోగ సమవేత పదార్థసార్మకా మంత్రాః" మంత్రాలను స్మరిస్తూ ప్రయోగాన్ని అనుష్ఠించవలె నన్నది 'విధి మీమాంస.' 'ఋచో హయోవేద సవేద దేవాన్' అన్నట్లు ఏయే మంత్రాలకు ఎవరెవరధిదేవతలో ఋక్కులు చక్కగా తెలిసినవారికే తెలుస్తుంది.

'అగ్నిమీళే పురోహితం' ఇత్యాది మంత్రాలను ఋగ్వేద పండితులూ, 'ఇషేత్వోర్జేత్వా' మొదలైన యజుర్వేద మంత్రాలను హోతా, అధ్వర్యుడూ మున్నగు ఋత్విజులూ ఉచ్చైస్స్వరంతో అధ్యయనం చేస్తున్నారు.

"ఆగ్నే ఆంగిరశ్శతంతే సన్త్వావృత స్సహస్రంత ఉపావృతః"

"యత్ర యజ్ఞో ఘృతస్యధారా అభితత్పవంతే" అనే వేద వాక్యాలవల్ల 'వేదాలను నూరుసార్లు ఆవర్తి చెప్పి, అంతకంటె పది రెట్లు వాటి తంతును నడిపిన విద్వాంసులే యజ్ఞానికి యోగ్యులనీ, వీరి వేదవాగ్ఝరులు ఆజ్యధారలతో పాటు పవిత్రంగా ప్రసరిస్తాయని తెలుస్తున్నది.

యజ్ఞకర్మల్లో ఋగ్యజుస్సామ లనే మూడు వేదాలు మాత్రమే ఉపయోగ పడుతాయి. అధర్వణ వేదం శాంతి, పౌష్టిక, ఆభిచారికాది కర్మకలాపాల్లో ఉప యోగపడుతుంది.

"యాంవై కాంచన ఋత్విజ అశిషమాశాసతే, యజమానాయతామాశాసతే" కర్మాంగోపాసనలో కర్తృత్వం ఋత్విక్కులకే ఉన్నా, యజ్ఞఫలాన్ని వారు యజమానికే అందజేస్తారని శ్రుతి చెప్పుతున్నది.

''హస్తహీనంతుయోఽధీతే స్వరవర్ణ వివర్జితమ్,
ఋగ్యజుస్సా మభిర్దగ్ధో వియోని మధి గచ్ఛతి.'' (శిక్ష-54)
''హస్తేన వేదంయోఽధీతే స్వరవర్ణార్థసంయుతమ్,
ఋగ్యజుస్సామభిః పూతో బ్రహ్మలోకే మహీయతే.'' (శిక్ష-55)

'హస్తచాలనం చేయకుండా, వర్ణస్వరాలను ఉచ్చరించకుండా మూడు వేదాలను అధ్యయనం చేసేవాళ్ళు విదగ్ధులు కాకపోవడమేకాదు, వాళ్ళు దగ్ధులై క్రిమికీటకాది జన్మలెత్తుతా'రనీ, 'స్వరాలను కరచాలనంతో సంకేతపరుస్తూ, శబ్దోచ్చారణ సౌష్ఠవాన్ని వ్యక్తంచేస్తూ, అర్థసహితంగా వేదమంత్రానువాకాలను పఠించేవాళ్ళు పవిత్రులై బ్రహ్మలోకంలో పూజింపబడుతా'రనీ పాణిని భగవా నుల ఆదేశం.

సకల ప్రాణులకు సుఖసంపదలు కలుగజేసే పవిత్రులైన వేదమూర్తులే ధర్మరాజు చేసే యాగంలో ఋత్విక్కులుగా వర్ణింపబడ్డారు.

*36* అవనీ భృతాం త్వామపహాయ
గణ మతిజడ స్సమున్నతమ్,
నీచి నియత మిహ యచ్ఛపలో
నిరతః స్ఫుటం భవసినిమ్నగాసుతః. *(15-21)*

శిశుపాలుడు భీష్ముణ్ని ఇలా నిందిస్తున్నాడు:

"అతి జడుడవూ చపలుడవూ అయిన నీవు మహోన్నతమైన భూభృద్గణాన్ని వదిలిపెట్టి నీచవృత్తి గల ఈ కృష్ణునియందే అనురక్తుడవయ్యావు. కాబట్టి నీవు అచ్చంగా గంగాపుత్రుడవే.''

ధర్మరాజు శ్రీకృష్ణుణ్ణి యజ్ఞసంరక్షకునిగా నియమించి రాజసూయ యాగం పూర్తిచేశాడు. తర్వాత సదస్య పూజకోసం మొట్టమొదట ఎవరిని పూజించాలి అని భీష్ముణ్ణి అడిగాడు.

స్నాతకుడు, గురువు, ఇష్టబంధువు, ఋత్విజుడు, జామాత, భూపతి– ఈ ఆర్గురూ పూజార్హులే. కాని వీరిలో అధిక గుణాలున్న ఒక్క వ్యక్తిమాత్రం పూజకు యోగ్యుడు. బ్రాహ్మణ క్షత్రియ సముదాయంలో సకలగుణ సంపన్ను డైన శ్రీకృష్ణుడే సభలో పూజింపతగినవాడని భీష్ముడు చెప్పగా ధర్మరాజు శ్రీకృష్ణుణ్ణి పూజించాడు. శిశుపాలుడు వెంటనే ఉగ్రుడై కుంతీసుతులను అధిక్షే పించాడు. ఇపుడు భీష్ముణ్ణి గేలిచేస్తున్నాడు.

శ్రీకృష్ణుడు స్నాతకాది గుణాలలో ఏ ఒక్క గుణమైనా లేనివాడు. మధురాధిపతి అయిన కంసుని పసులను కాసే నందుని బిడ్డడు. కాబట్టి కృష్ణుడు సేవకుడే. అందుకే అతడు నీచుడు.

భూభృతులు అంటే రాజులు అనీ, గుట్టలనీ రెండర్థాలున్నాయి. రాజులు మహోన్నత పురుషులుకదా! వాళ్ళందరినీ విడిచిన చపలుడవు. పెళ్ళి పెడాకు లేమీ లేక ఇష్టం వచ్చినట్లు తిరిగేవాడవు. నెత్తి నెరసిందే కాని బుద్ధి జాడ్యం విడువలేదు. పెద్దవాడవని అడిగితే కౌంతేయులకు దుర్బోధ చేస్తావా? ఇందరు రాజులుండగా ఒక్క నీచునివైపు నీ బుద్ధి దొర్లడం చూస్తుంటే నీ కన్నతల్లి గుణాలు నీలో కనిపిస్తున్నాయి.

నీ తల్లి నిమ్నగ. ఎత్తైన గుట్టలను విడిచిపెట్టి చల్లగా, మెల్లగా, పల్లానికి పారే ఏరు. ఆ ఏటికి పుట్టిన నీలో ఆ గుణాలుండక ఎటుపోతాయి? అంటాడు శిశుపాలుడు.

భీష్ముడు గాంగేయుడు. పవిత్ర వర్తనుడు. తత్త్వజ్ఞుడు. వృద్ధుడు. ధర్మ బద్ధుడు. మహోన్నతులైనా భూభర్తలను లక్ష్యపెట్టని వీరుడు. తండ్రి గుణాల కన్నా తల్లి గుణాలే అధికంగా అతనికి సంక్రమించాయి.

మత్సరగ్రస్తుడైన చైద్యుడు ఈ గుణాలనే విపరీతార్థంలో వ్యాఖ్యానించి నట్లు రచించి, మాఘకవి తన కవితా మూర్తిని 'కావ్యలింగం'తో అలంక రించాడు.

37 నిహతోన్మద దుష్టకుంజరా
ద్దధతో భూరి యశః క్రమార్జితమ్,
న బిభేతి రణే హరే రపి
క్షితిపః కా గణనాఽస్య వృష్టిషు. (16-59)

శిశుపాలుడు కోపంతో సభ నుంచి లేచిపోయిన తర్వాత సమర్థుడైన ఒక దూతను శ్రీకృష్ణుని వద్దకు పంపుతాడు. ఆ దూత శ్రీకృష్ణునితో ప్రియంగానూ, అప్రియంగానూ ఉండే భిన్నార్థకమైన మాటలు పలుకుతాడు.

'శిశుపాలుని తల్లికిచ్చిన మాట భంగమవుతుందని సభలో దూషించినా అతణ్ణి శ్రీకృష్ణుడు చంపలేదు. అతని దూషణలు 'నూరు' కాలేదు. కానీ దూత ముఖాన వినిపించిన దూషణలతో 'నూరు' నిండినాయి. నీవు ఇకపైన అప్రియంగా మాటాడితే మా కోపాన్ని రుచిచూస్తా'వని సాత్యకి ఆగ్రహంతో దూతను హెచ్చరిస్తాడు.

అపుడు దూత భయపడకుండా ఇలా అంటాడు.

''ఉన్మత్త దుష్ట గజవధచేసి గొప్ప కీర్తిని పొందిన హరివల్లకూడా చేది దేశాధిపతి యుద్ధమందు భయపడడు. ఇక అతనికి వృష్ణులొక లెక్కా ?''

'హరి' అంటే శ్రీకృష్ణుడనీ, సింహం అనీ రెండర్థాలు 'వృష్ణులు' అంటే యాదవులే కాక మేకలని మరో అర్థం. 'కుంజర' శబ్దంతో 'కువలయాపీడం' స్ఫురిస్తుంది.

"అవక్ర విక్రమంతో అనేక మత్తేభాలను చీల్చి చెండాడిన సింహం వల్ల కూడా భయపడని వ్యక్తికి మేకపోతులంటే లెక్కేమిటి ?'' అని మరో అర్థం. యాదవులను మేకలని కేకరిస్తూ శ్రీకృష్ణుణ్ణి బూకరించడంతో దూత చేసిన పని ప్రధానంగా శిశుపాలుణ్ణి పొగడడమే అని దీనివల్ల తెలుస్తున్నది. యాదవులకూ చేదిరాజుకూ అజగజ భేదమున్నదని ధ్వని.

38 కశ్చిన్మూర్ఛా గాఢప్రహార
స్సిక్తశ్శీతై శ్శీకరై ర్వారణస్య,
ఉచ్ఛ్వాస ప్రస్థితా తంజిఘృక్ష
ర్వ్యోమార్థాహూతా నాకనారీముమూర్ఛ. (18-58)

రణభేరీ వాద్యాల ధ్వని మిన్నుముట్టుతుండగా చైద్య యాదవ సైన్యాలు ఉత్సాహంతో ఉరకలువేస్తూ ఘోరయుద్ధం చేస్తున్నాయి. ఆ సమరంలో ఒక సన్నివేశాన్ని వర్ణించే శ్లోకమిది.

"ఒక వీరుడు బాగా దెబ్బ తగిలి స్మృతి తప్పిపడిపోయి, ఒక ఏనుగు తొండంలోని నీటి తుంపరలచేత తడిసి, కాసేపటికి తేరుకున్నాడు. కానీ మృతి చెందినాడనుకొని ఆ వీరుణ్ణి వరింపవచ్చిన ఒక నిర్జరాంగన తనకోరిక నెరవేరక మూర్ఛపోయింది."

యుద్ధంలో మరణించిన వీరులకు తమతో మొదటి కలయిక కదా అని రంభ, ఊర్వశి, తిలోత్తమ మొదలైన దేవవేశ్యలు సింగారించుకొని సిద్ధంగా ఉన్నారు.

"అకుర్వత ప్రథమ సమాగమోచితం
చిరోజ్ఝితం సురగణికాః ప్రసాధనమ్." (17-34)

అంతలోనే ఒక వీరునికి సమరంలో చావుదెబ్బ తగిలింది. మూర్ఛవచ్చి పడిపోయాడు.

"నా యుధ వ్యసనప్రాప్తం నార్తం నాతి పరిక్షతమ్,
న భీతం న పరావృత్తం సతాం ధర్మమనుస్మరన్"

(మనుస్మృతి. 7 అ. 93)

'బాగా దెబ్బ తగిలి పడిపోయిన వీరుణ్ణి శిష్టులైన క్షత్రియులు హతమార్చకూడదు' అనే న్యాయాన్ని అనుసరించి, పగవాడే అయినా ఎవరూ అతణ్ణి చంపలేదు. ఇంతలో ప్రక్కనున్న ఏనుగు సహజంగా చిల్కిన తొండంలోని నీటి చిన్కులకు ఒళ్ళంతా తడిసిపోయి ఆ వీరుడు మూర్ఛనుంచి తేరుకున్నాడు.

కానీ, వీరశయ్య నలంకరించిన వీరుని వెచ్చని కౌగిట్లో ముచ్చట తీరుతుందని వలచి వచ్చిన ఒక అచ్చరలేమకు అతని శ్వాస చూడగనే మూర్ఛ వచ్చిందట.

ఆహవ వీరుని మూర్ఛ అప్సరసకు సంక్రమింపజేయడంలో ఉంది కవి చేసిన చమత్కారమంతా.

**39** సత్త్వం మానవిశిష్ట మాజిరభసాదాలంబ్య భవ్యః పురో
లబ్ధాఘుక్షయ శుద్ధి రుద్ధరతర శ్రీవత్సభూమిర్ముదా,
ముక్త్వాకా మమపాస్త భీః, పరమృగవ్యాధ స్సనాదం హరే
రేకౌఘైస్సమకాల మభ్రముదయేరోపై స్తదా తస్తరే.

మూర్తీభవించిన వీరరసంగా అగపడుతున్న శ్రీకృష్ణుని యుద్ధాన్ని వర్ణించే శ్లోకమిది.

"కళ్యాణమూర్తి, పాపనాశకుడు, పరిశుద్ధుడు, శ్రీవత్స లాంఛిత సమున్నతోరస్కుడు, నిర్భీకుడు, శత్రు మృగాలవేటగాడు, అభ్యుదయ పరుడు అయిన శ్రీకృష్ణుడు అమరోత్సాహం వల్ల అభిమానబలాన్ని పెంచుకొని సింహ గర్జన చేసి శర పరంపరతో గగనాన్ని కప్పివేశాడు."

వీరుడు సాధారణంగా క్రోధోద్దీపితుడై శారీరిక మానసిక వికారాలతో భయంకరంగా ఉంటాడు. కానీ శ్రీకృష్ణుడు నిర్వికారుడు. గుణం ఎంత దివ్యమైనదో, రూపం అంత భవ్యమైనది. తానెంత పరిశుద్ధుడో, తనను దర్శించిన వారి పాపాలను పంచ బంగాళం చేసేటంత స్ఫూర్తి ఉన్న మూర్తి ఆయన. శ్రీవత్సం (తెల్లని రోమాల సుడి) మహాపురుష లక్షణంగా ఉన్న ఎత్తైన ఎడద ఆయనది. ఏ బెదదా లేనివాడు. సదనంలోగానీ కదనంలో గానీ సకల జనుల డెందాలను కందళింప జేసే కల్యాణమూర్తి.

ఆయన పరమృగ వ్యాధుడు, అంటే పగవారు మృగాలవంటివారై నప్పుడే వారిని బాధించే వ్యాధుడతడు.

"శ్వఘ్నీవ యోజిగీవాన్ లక్షమాదత్." వ్యాధునివలె భగవానుడు అక్ష్యాన్ని భేదిస్తాడ్నది వేదం. అలా వారిని బాధించడం కూడా విశ్వంభరాభ్యుదయం కోసమే.

"చైద్యః పరాన్ పరాజిగ్యే మానవానభియోగః"(19-82) కాకలు దీరిన తన సైనికులను హతమార్చిన యాదవ సైనికులను శిశుపాలుడు ముందడుగు వేయనీయక చీకాకు పరచగానే శ్రీకృష్ణుడు ఉత్సాహంతో సింహనాదం చేసి ఒక్క పెట్టున లెక్కలేనన్ని బాణాలను హస్తలాఘవంతో వేశాడు. కాబట్టి అవి గగన మగపడకుండా విస్తరించాయి.

"తాంగూహత తమ సాపవ్రతేన, యధామీ అన్యోఽఅన్యన్న జానన్" అని వేదం చెప్పినట్లు 'శస్త్రాలు ఆకాశానికి అడ్డుగా నిలిస్తే ఏర్పడిన చీకటి, శత్రువుల నాచ్ఛాదించి వాళ్ళను వాళ్ళలోనే ఒకరి నొకరు గుర్తు పట్టరాకుండా చేస్తుంది'

వీర రసానికి తగినట్లుగా శార్దూల వృత్తాన్ని ప్రయోగించాడు కవి.

వాస్తవ జగత్తులో యుద్ధ వ్యూహాలను పన్నడం వంటిదే, కావ్య జగత్తులో బంధ కవిత ల్లడం. కాబట్టి, ఈ శ్లోకంలో అశ్లిష్ట రూపకాలంకారంతో పాటు 'చక్ర బంధం' అనే శబ్దాలంకార విశేషముంది.

"దండం, భోగం, మండలం, అసంహతం" అని నాలుగు రకాలుగా ఉండే వ్యూహాలలో 'చక్రబంధం' మండల భేదంలోనిది. అందుకే-

"విషమం సర్వతో భద్ర చక్ర గో మూత్రికాదిభిః,
శ్లోకైరివ మహాకావ్యం వ్యూహైస్తదభవద్బలమ్." (19-41)

'సర్వతోభద్ర చక్రబంధాది శ్లోకాల రచనతో మహాకావ్యం వలె వ్యూహాల రచనతో శిశుపాలుని సైన్యం దురవగ్రహంగా ఉన్న' దన్నాడు కవి.

ముఖ్యంగా వ్యూహాలను చిత్రబంధాలతో పోల్చి శిశుపాల వధ మహాకావ్య మెలాంటిదో మాఘ కవి విశదపరచాడు.



ఒక దానిలో నొకటి చొప్పున పది వృత్తాలను గీసి, ఆరు రేకులను సమాన రేఖలను గీయాలి. ఒక్కొక్క రేకులో నాభి స్థానంతో పాటు పందొమ్మిది గదులేర్పడుతాయి. రేకుకొక్క పాదం చొప్పున ప్రదక్షిణ రీతిగా మూడు పాదాలు వ్రాసి, నాల్గవ పాదాన్ని చక్రనేమిగా ఉన్న వెలుపలి వృత్తంలో వ్రాయాలి. మూడవ, ఆరవ వలయంలో కవి పేరూ, కావ్యం పేరూ ఒదుగుతుంది.

40 రాహుస్త్రీ స్తనయో రకారి సహసా
యేనాశ్లథాలింగన
వ్యాపారైక వినోద దుర్లలితయోః
కార్కశ్య లక్ష్మీర్వృథా,
తేనాక్రోశత ఏవ తస్య మురజి
త్తత్కాల లోలానల
జ్వాలా పల్లవితేన మూర్ధవికలం
చక్రేణ చక్రే వపుః. (20.78)

సమరంలో శస్త్రాస్త్రాలతో శ్రీకృష్ణుణ్ణి జయించడానికి శక్తి చాలక చివరకు ఈటెల పోటులాంటి మాటలతో మర్మాన్ని భేదించే శిశుపాలునిపైన శ్రీకృష్ణుడు ప్రయోగించిన చక్రవర్ణన మిది.

"సడలని బిగికౌగిలి ఆనందానికి ఆరాటపడే రాహుపత్నీస్తనాల కాఠిన్య శోభను వ్యర్థంచేసిన సుదర్శన చక్రాన్ని, ఇప్పుడు అగ్నిజ్వాలలతో అది ప్రజ్వరిల్లుతుండగా శ్రీకృష్ణుడు ప్రయోగించి, అదే పనిగా దూషిస్తున్న శిశుపాలుని తలను అతని దేహంపైన లేకుండా చేశాడు."

సముద్ర మథనంవల్ల ఆవిర్భవించిన అమృతాన్ని అక్రమంగా పానం చేసిన రాహుకంఠాన్ని విష్ణువు చక్రంతో ఖండించాడు. ఆలింగనాది సుఖసాధనమైన శరీరం లేకుండా రాహువు, తన భార్యను కేవలం చూచుకుంటూ మురువడానికి తలమాత్రమే మిగిలి ముద్దుకోసం బ్రతుకుతున్నాడు బండబ్రతుకు. శిశుపాలుడు వాగ్బాణాలతో మర్మాన్ని భేదిస్తుంటే శ్రీకృష్ణుడు చక్రంతో శిశుపాలుని కంఠాన్ని ఖండించాడు.

"యో అస్మభ్య మరాతీ యా ద్యశ్చనోద్వేషతేజనః,
నిందాద్యో అస్మాన్ ధిప్సాచ్చ సర్వం తం భస్మసాత్కురు."

'ధర్మాత్ములపట్ల పగబూని ద్వేషంతో నిందించే వ్యక్తిని బుగ్గిబూడిదచేయు' మన్నది వేదం. వేదవేద్యుడు ఆ పని చేశాడు. నేరానికి తగిన శిక్ష ఇది.

ఆనందంగా జీవించాలని ధూర్తత్వంతో అమృతపానం చేసిన రాహువుకు శిరస్సు మిగిలింది. శరీరం వికలమయింది. తలుపూ తాళమూ లేకుండా దుర్భాషలతో, దూషణలతో నోరు పారవేసుకున్న శిశుపాలునికి శరీరం మిగిలింది. శిరస్సు వికలమయింది. ఇది భేదం. ఇదంతా శ్రీకృష్ణుని ఇష్టప్రకారం చేసిన చక్రాయుధ మహిమ.

చక్రంతో శిరశ్ఛేదనం చేసెనన్న వ్యంగ్యార్థాన్ని పర్యాయంగా అంటే స్తన కర్కశ్యశోభను పాడుచేసెనని భంగ్యంతరంగా చెప్పి 'పర్యాయోక్తం' అనే సువర్ణాభరణంతో కవి శ్లోకాన్ని సుశ్లోకం చేశాడు.

శిరః ఖండనకు తగిన జటిల సమాస పదాలతో నిబద్ధమైన శార్దూల వృత్తమిది.

ఇలా కావ్య ముఖ్యప్రయోజనాన్ని-అంటే, శిశుపాలుని వధను ఈ శ్లోకంలో ఎంతో మనోహరంగా చెప్పాడు మాఘుడు.

శిశుపాలుని దేహంనుంచి నిర్గమించిన దివ్యతేజస్సు శ్రీకృష్ణునిలో లీనం కావడంతో ఈ కావ్యం పరిసమాప్తమవుతుంది.



# యువభారతి
## సాహితీమిత్ర పథకం

యువభారతి తన కృషిలో పాలు పంచు-కొనే మిత్రుల కోసం ఎదురుచూస్తున్నది. సాహితీ మిత్రులుగా చేరి, సాహిత్యోద్యమ నిర్వహణలో బరువు బాధ్యతలు పంచుకొనే సహృదయుల సహకారం ఆకాంక్షిస్తున్నది. యువభారతితో సర్వదా సాహితీబాంధవ్యాన్ని పటిష్టం చేసు-కోవాలనేదే సాహితీమిత్ర పథకధ్యేయం.

కేవలం రూ.10/-లతోనే సాహితీ మిత్రులుగా చేరండి.

మీ సాహితీ స్నేహాన్ని అందించండి.

తెలుగు ఎదలో తెలుగుతనం
వెల్లువలా పారాలని
తెలుగింటిలో తెలుగుదీపం
అఖండంగా వెలగాలని
ఈ జాతి నిద్రలేచి
మహోన్నత మానవాదర్శాల వైపు
నిరంతర కృషితో
పయనం కొనసాగించాలనే ధ్యేయంతో
ఉడుతాభక్తిగా యువభారతి కృషిచేస్తున్నది
భాషాభిమానం కలగాలంటే
మాతృభాషా సాహిత్య పఠనమే
ప్రథమ కర్తవ్యం అనే భావం
బలంగా మనసులో నాటుకోవడానికి గాను
వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు
ఉత్తమసాహిత్యం అందించేందుకు
యువభారతి పూనుకున్నది
ప్రతి తెలుగింటిలో
కనీసం పదయినా తెలుగు పుస్తకాలు ఉండేందుకు
మనందరం ఉద్యమ వేగంతో కృషిచేద్దాం
ఆ పదిమంది పుస్తకాలలో ఏ ఒక్కటిగానైనా
యువభారతి ప్రచురణ ఏ ఒక్కటైనా
ఉండాలనే ధ్యేయంతో కృషిచేద్దాం

# యువభారతి

సాహితీ, సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు - 3